# The
# Andhra Pradesh Legislative Assembly Debates

*( Part II - Proceedings other than Questions and Answers )*

OFFICIAL REPORT

---

## Seventeenth day of the Fifth Session of the Andhra Pradesh Legislative Assembly

---

### ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

**Friday, the 3rd May 1957.**

The House met at Half Past Eight of the Clock

[ *Mr. Speaker in the Chair* ]

QUESTIONS AND ANSWERS

*(See Part I)*

PAPERS LAID ON THE TABLE OF THE HOUSE:

*Amendment to the Andhra Public Service Commission Regulations.*

THE CHIEF MINISTER (SRI N. SANJEEVA REDDI): I beg to lay on the table of the House, under clause (5) of Article 320 of the Constitution of India, a copy of Notification issued with G. O. No. 21 General Administration (Services-A) dated 8—1—1957 making an amendment to the Andhra Public Service Commission Regulations.

MOTION UNDER RULE 74 OF THE ASSEMBLY RULES

మిస్టర్ స్పీకర్ :— ఈ రోజున మన ఎసెంబ్లీ రూల్సులోని 74 వ రూలు క్రింద రెండు motions సభ్యులు యిచ్చారు. అందులో మొదటిది బి. వి. శివయ్య గారిది. "తక్కువ వేతనములు పొందే నాన్ గెజిటెడ్ వుద్యోగులకు ప్రభుత్వము యిటీవల యిచ్చిన అలవెన్సులను గ్రామమునసబు, కరణములకు కూడ వర్తింప చేయనందులకు" అని యిచ్చారు.

74 ప రూలు క్రింద "urgent matter of public importance" అయి ఉండాలి. Urgent matter అంటే, House of Commons వగైరా చోట్లలో 'ఏ విషయమైనా sudden గా అంటే ఆకస్మికముగా వచ్చిన దానికి' అని

అన్నారు. కాబట్టి యిది ఆకస్మికముగా తటస్థ పడితేనే యిది urgent matter of public importance క్రింద 74 వ రూలు అన్వయిస్తుంది. అప్పుడు దానిని admit చేయడము, discussion వగైరాలు చేయడము ఉంటుంది. కాని ఇప్పుడు యీ గ్రామమునసబు, కరణముల వ్యవహారాలు యిప్పటికి కొన్ని తరాలనుంచి వస్తున్నవి. నేను 1926 వ సంవత్సరములో అసెంబ్లీ మెంబరుగా ప్రవేశించినప్పటినుంచి కూడా వస్తున్నవి. కాబట్టి యిందులో urgent విషయము ఏమీ లేదు. ఇప్పుడు యీ notice యొక్క కాపీని శ్రీకళా వెంకటారావుగారికి పంపించాము. వారితో వెళ్ళిమాట్లాడవచ్చు. గ్రామమునసబు, కరణముల తరపున deputation కూడ వస్తే. దురదృష్టవశాత్తు, వారిని కలుసుకోలేకపోయినారు. కాబట్టి యీ విషయము 74 వ రూలు క్రిందకు రాదు. ఇందులో urgent matter ఏమీ లేదు. దీనిని మంత్రి గారే deal చేస్తారు. గనుక దీనిని త్రోసివేస్తున్నాను.

తరువాత రెండవది, రాజగోపాల నాయుడుగారు యిచ్చినటువంటిది. అది "spring channels క్రింద, అంటే ఊట నీరుపల్ల పల్లపు సాగుచేస్తూండే వారికి ప్రభుత్వము శిస్తువేసి వసూలు చేయడము అక్రమము అని, అశాస్త్రీయము అని" అన్నారు. ఇదికూడ urgent matter ఏమీ కాదు. ఇది ఎన్నో రోజులుగా జరుగుతున్నది. అది ఒకవేళ అక్రమము, అశాస్త్రీయము అయితే, దానికి లాయరు నోటీసు యివ్వవచ్చు. కోర్టుద్వారా redress పొందవచ్చు. కాబట్టి యిందులో urgent matter ఏమీ లేదుగనుక, యీ విషయము ప్రభుత్వానికి చెప్పండి. వారు ఆలోచించి చేస్తారు. ఇంకా కావాలంటే రేపు బడ్జటుపై చర్చలో మాట్లాడండి. అందువల్ల యిది కూడ 74 వ రూలు క్రిందకు రాదు గనుక, దీనిని కూడ త్రోసివేస్తున్నాను.

## RESOLUTION RE: ELECTION OF ONE MEMBER TO THE ZONAL RAILWAY USERS' CONSULTATIVE COMMITTEE OF THE SOUTHERN RAILWAY.

THE MINISTER FOR COMMUNICATIONS (SRI M. NARASINGA RAO): I beg to move:

"That as Sri P. Thimma Reddi, M.L.A., now Minister for Agriculture, member, representing the State Legislature on the Zonal Railway Users' Consultative Committee of the Southern Railway has tendered his resignation for the membership on the above Committee on 2—4—1957, and the vacancy will have to be filled in and as the General Manager, Southern Railway, has requested the Government to communicate to him the

name of the member to represent the Andhra Pradesh Legislative Assembly on the Committee, this Assembly do recommend to the Government to communicate to the Southern Railway the name of one person belonging to the area covered by the Southern Railway elected by this Assembly to serve on the Committee."

MR. SPEAKER : The question is :

"That as Sri P. Thimma Reddi, M. L. A., now Minister for Agriculture, member, representing the State Legislature on the Zonal Railway Users' Consultative Committee of the Southern Railway has tendered his resignation for the membership on the above Committee on 2—4—1957 and the vacancy will have to be filled in and as the General Manager, Southern Railway, has requested the Government to communicate to him the name of the member to represent the Andhra Pradesh Legislative Assembly on the Committee, this Assembly do recommend to the Government to communicate to the Southern Railway the name of one person belonging to the area covered by the Southern Railway elected by this Assembly to serve on the Committee."

The motion was adopted.

MR. SPEAKER : With reference to the motion of the hon. Minister for Communications regarding the election of one member to the Zonal Railway Users' Consultative Committee of the Southern Railway, I fix 3 p. m. on the 4th May 1957 as the time within which nomination papers of candidates for election to the Zonal Railway Users' Consultative Committee should reach the Secretary.

If the number of candidates nominated exceeds the number of vacancies to be filled, namely one, a poll will be taken on a date to be announced in due course. The election will be by ordinary method (direct election) and not according to the principle of proportional representation by means of the single transferable vote.

## THE ANDHRA PRADESH GENERAL SALES TAX BILL, 1957 (AS REPORTED BY THE SELECT COMMITTEE)

*THE MINISTER FOR FINANCE (DR. B. GOPAL REDDI): Mr. Speaker Sir, In the absence of the Chairman of the Select Committee (Sri Kala Venkata Rao), I beg to present the report of the Select Committee on the Andhra Pradesh General Sales Tax Bill, 1957 (L. A. Bill No. 7 of 1957):

Select Committee వారు 3 రోజులు కూర్చొని దీనిలో ఉన్నటువంటి విషయాలన్నీ సాంగోపాంగంగా చర్చించినారు. చాలవరకు ఏకాభిప్రాయం గానే తీర్మానాలు pass చేసినారు. కాని సుందరయ్య గారు, ఇతరులు కొన్ని విషయాలలో కొన్ని Minutes of Dissent కూడా పంపించారు. కఠినమైన నిబంధనలన్నిటిని కొంతవరకు సడలింపు చేయడానికి కూడా Select Committee వారు ప్రయత్నించినారు. ఆంధ్రలో ఉన్నటువంటి Sales Tax Act, Purchase Tax Act, Tobacco Tax Act, తెలంగాణాలో ఉన్న Sales Tax Act, మొదలైన వన్నీ ఒకటే Act గా చేయడానికి, రెండు ప్రదేశాలలో ఒకేరకమైనటువంటి Sales Tax నిబంధనలు, రేటు వగైరాలు ఉండడానికి ఉపయోగ పడుతుందనే ఉద్దేశ్యంతోనే Select Committee అన్ని విషయములు ఆలోచించి ఈ report ను తయారుచేసినారు. దీనిని చర్చ చేసి త్వరలోనే Bill చేయవలసిందని కోరుతున్నాను.

MR. SPEAKER. The Report of the Select Committee on the Andhra Pradesh General Sales Tax Bill, 1957 is presented.

DR. B GOPAL REDDI: Sir, I beg to move that the Andhra Pradesh General Sales Tax Bill, 1957, as reported by the Select Committee, be taken into consideration at once.

శ్రీ పి. సుందరయ్య (గన్నవరం): మంత్రి గారు తమ ఉపన్యాసంలో Bill యొక్క ఉద్దేశ్యాలు facts, figures ఏమీ చెప్పకుండా consider చేయమని చెప్పడం బాగాలేదు.

డాక్టర్ బి. గోపాల రెడ్డి :- ఇదివరకే సాంగోపాంగంగా చర్చచేసి ఈ బిల్లును Select Committee కి refer చేసినారు. Select Committee వారు మూడు రోజులు కూర్చుని అన్ని విషయాలు ఆలోచించి ఈ report ను తయారు చేసినారు. మెంబర్లు ఏదైనా చెబితే అప్పుడు మేము చెప్పడానికి వీలు అవుతుంది. Select Committee ఏమీ పెద్ద changes చేయలేదు. ఇంచు మించుగా అంతకు ముందు ఉన్నటువంటి బిల్లు ప్రకారమే ఉన్నది కాబట్టి re-publication అవసరం లేదని సెలక్టు కమిటీ అనుకొన్నప్పుడు నేను ప్రారంభోపన్యాసం చేసి కాలాన్ని హరించడం న్యాయం కాదేమోనని అను కుంటాను. మెంబర్లు చెప్పిన దానికి reply గా చెప్పవచ్చును. లేదా Clause by clause చర్చ వచ్చినపుడు విపులంగా చర్చించు కోవచ్చునేగాని ఈ general debate కు ప్రారంభోపన్యాసం చేయవలసిన అవసరం లేదేమో నని అనుకుంటాను.

MR. SPEAKER:-So the motion is for general discussion. Select Committee వారు నిర్ణయించినటువంటి విధంగా ఈ బిల్లు తమ ఎదుట ఉన్నది. దానిని గురించి అభిప్రాయము చెప్పిన తరువాత clause by clause తీసుకొందాము. Clause by clause తీసుకోడానికి ఒక చిక్కు వచ్చినది. ఎందువల్ల నంటే amendments ఇవ్వడానికి మధ్యాహ్నం మూడు గంటల వరకే time ఇచ్చాము. కనుక మనం ఇక్కడ కూర్చున్నంత సేపు general discussion మాత్రమే చేయాల్సి ఉంటుందని అనుకుంటాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (స_త్తెనపల్లి):- అధ్యక్షా ! ఈ notice ఇళ్ళకు పంపించామని చెప్పారు. మాకు నిన్న సాయంత్రం వరకు అందలేదు

మిస్టర్ స్పీకర్:- ఇప్పుడు చెబుతున్నాను. ఇవ్వాళ 3 గంటలలోపల ఇవ్వండి.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:- అది కాదండి. కా_స్త time కావాలి. చాల పెద్ద బిల్లు యిది. రేపు ఉదయం వరకు time యిస్తే ఇవ్వాళ మేము చదువుకొని amendments ఇవ్వడానికి వీలుగా వుంటుందని మనవి చేస్తున్నాను.

మిస్టర్ స్పీకర్;- ఉదయం 8-30 గంటలకే మనం తిరిగి సమావేశమవుతున్నాము. అవన్నీ రోనియో చేసి అందరికి యివ్వాలి. కనుక సాయంత్రం 5 గంటల వరకు time యిస్తాను. ఇదివరకు చదివిండి. discuss చేసిందే గనుక ఆ విధంగా మెంబర్లంతా తోడ్పడవలెనని కోరుతున్నాను.

Motion moved.

"That the Andhra Pradesh General Sales Tax Bill 1957, as reported by the Select Committee, be taken into consideration at once."

*శ్రీ పి. సుందరయ్య:- అధ్యక్షా ! ఆంధ్రప్రదేశ్ జనరల్ సేల్స్ టాక్సు బిల్లును ఇదివరకు అసెంబ్లీ చర్చించింది. సెలక్టు కమిటీకూడా 3 రోజులు సాకల్యంగా చర్చించింది. పెద్ద మార్పులు ఏమీ చేయలేదు. అందుచేత దీనిమీద చర్చ జరిగేటప్పుడు నేను ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరంలేదని మంత్రిగారు చెప్పారు. ఇదివరకే చట్టం వున్నది. దానినే కొద్ది మార్పులతో చేయబోతున్నాము కనుక దీనినిగురించి ఎక్కువ అవకాశం ఇవ్వడం ఏమిటి అనే ధోరణిలో శాసనసభ్యులకుగాని, ప్రజలకుగాని notice ఇవ్వకుండా, తగిన కాలవ్యవధి లేకుండా ఇటువంటి ముఖ్యమైన పన్నుల బిల్లులను తీసుకొనిరావడం అనేది ప్రజాతంత్రానికిగాని, శాసనసభా కార్యకలాపాలు సక్రమంగా నెరవేర్చడానికిగాని తోడ్పడదని ఇదివరకు ఒక పర్యాయం చెప్పడం జరిగింది. మరల అదే ఇంకో పర్యాయం చెప్పకతప్పదు. సెలక్టు కమిటీకూడా 3 రోజులు కూర్చుంది.

ఇచ్చిన time ప్రకారం అంతకన్న ఎక్కువ చేసేదానికి వీలులేకపోయింది. ఈ Sales Tax యొక్క పరిస్థితి అన్నిరాష్ట్రాలలో ఏ రీతిగా ఉన్నది? మన రాష్ట్రంలో ఏ రీతిగా ఉన్నది ? కేంద్ర ప్రభుత్వం ఏమి చెయ్యబోతున్నది ? దానివల్ల వచ్చే లాభనష్టాలు ఏమిటి ? Sales Tax వల్ల ఎంత డబ్బు వస్తుంది? ఎంతమంది దగ్గర వసూలు చేయాల్సి వుంటుంది? దానివల్ల వచ్చే కష్టనష్టాలు వీటన్నిటిని గురించి శాసనసభ్యులకు, ప్రజలకు సమగ్రమైన దృక్పథాన్ని ఈ వేదికమీద నుంచి తెలియజేయవలసిన బాధ్యత మంత్రిగారిపై ఉన్నది. వారు అట్లా చేయకుండా ముందు శాసనసభ్యులు విమర్శిస్తే. ఆ విమర్శలకు ఏదో సమాధానం చెపుతామని చెప్పడం న్యాయంకాదు అని చెప్పక తప్పదు. అసలు Sales Tax బిల్లును గురించి ఆలోచించినప్పుడు ప్రభుత్వం చెప్పే వాదన ఏమిటంటే— మనం అభివృద్ధి కార్యక్రమాలు చాలా సాగిస్తున్నాం కనుక దానికి డబ్బుకావాలి. డబ్బుకోసం పన్ను వేయాల్సి వుంటుందని చెపుతున్నారు. Sales Tax ఎక్కువ చేయకపూర్వం భూమి పన్ను, motor vehicles పన్ను, entertainment tax, stamp fees, ఇటువంటివన్నీ ఇదివరకే ఎక్కువ చేశాము. రాష్ట్ర అధికారం క్రింద ఏమేమి పన్నులు వేసేదానికి హక్కు ఉన్నదో వాటన్నిటిని ఇదివరకే ఎక్కువ చేశాము. ఉన్నవాటినే మరికొంత అదనంగా చేసుకొంటే తప్ప ఆదాయం పెరగదు. ఆదాయం పెరగకుంటే ప్రజలకు కావలసిన పనులు ఏమీ చేయలేము. అంతే కాకుండా కేంద్ర ప్రభుత్వము వారు "మీ revenue dificit ను ప్రతి సంవత్సరం పూడుస్తున్నాము. అభివృద్ధి కార్యక్రమాల క్రింద ఎక్కువ డబ్బు ఇచ్చి ఏమిలాభం? మీ revenue ఖర్చులకు కావలసిన ఆదాయాన్నైనా మీరు సంపాదించుకోకపోతే ఎలాగ ? మీరు పన్నులు ఎక్కువ వేసుకోండి" అని అన్నారు. కేంద్రప్రభుత్వముయొక్క వాదనతోగాని ఈ ప్రభుత్వం పన్నులు ఎక్కువచేస్తూ ఈ బిల్లును తెచ్చిన వాదనతోగాని, నేను ఏమాత్రం ఏకీభవించడం లేదు. ఈ ప్రభుత్వంయొక్క వైఖరి, కేంద్రప్రభుత్వం యొక్క వైఖరి రెంటిని చూచినప్పుడు ఇటువంటి బిల్లులు వచ్చినపుడు, అభివృద్ధి కార్యక్రమాల కొరకు పన్నులు వేయాల్సి వుంటుందని చెపుతూవుంటే దానికి ప్రజాప్రతినిధులుగా మనం అంగీకరించడం అనేది నష్టకరంగా, హానికరంగా కనబడుతుంది. ఎందువల్లనంటే, వారు చెప్పిన సూత్రాలు అన్నీ పరస్పర విరుద్ధమైనవి. ప్రజలను నిర్లక్ష్యం చేసేటటువంటి సూత్రాలు. ఇవి ప్రజలమీద అదనంగా భారం వేసేవి తప్పితే ఏ విధంగాను ఉపయోగించేవి కావు. ఇదివరకు Sales Tax విషయంలో, ప్రభుత్వానికి ఆదాయం గనుక వస్తే దానివల్ల అభివృద్ధి కార్యక్రమాలు చేసేదానికి వీలుగా ఉంటుందనే దృష్టితో ఆలోచించే వాళ్లము. ఇక

ఆ రకంగా ఆలోచించడం తప్పు. ఆ రకంగా ఆలోచించడము అంటే ప్రజలకు హాని చేయడమేనన్న అభిప్రాయానికి రాకతప్పింది కాదు. ఉదాహరణగా Sales Tax విషయమే తీసుకొంచాము. ఇదేదో సామాన్యమైన బిల్లుఅని అంటున్నాము. ఈ బిల్లు త్వరగా pass చేసి అమలులోకి తెచ్చినట్లయితే సంవత్సరానికి 9 కోట్ల రూపాయల పన్నులు వసూలు చేయగలమని మంత్రివర్గము, ప్రభుత్వము అంచనా వేసుకొంటు న్నారు. ఆంధ్ర రాష్ట్రంలోని Act amend చేయకముందు 3 కోట్లు, Amend ment, Bill అయిన తరువాత అదనంగా మరో 2 కోట్లో. 3 కోట్లో వసూలు చేస్తామని, తెలంగాణా ప్రాంతంలో ఇదివరకు 2 కోట్ల చిల్లర వసూలు చేసేవాళ్లమని అంటున్నారు. ఈ పన్నులు అదనంగా వేయబట్టి మరో 2 కోట్లు అదనంగా వసూలు చేసుకోగలమని ప్రభుత్వము యొక్క అంచనా. మన రాష్ట్ర budget, కేంద్ర ప్రభుత్వం ఇచ్చే గ్రాంట్లు, అన్ని కలుపుకొని, దాదాపు 45, 50 కోట్ల రూపాయల ఆదాయం వస్తూఉంటే దాంట్లో దాదాపు 9, 10 కోట్ల రూపాయలు sales tax మీదే వస్తోంది. అటువంటప్పుడు ఈ బిల్లు ఎంతో తేలికైనదని, పాతకాలం నాటి బిల్లులన్నీ సమగ్రం చేసిపెడుతు న్నామని అనడం ఎంతమాత్రం సరైనది కాదు. ఒక విధంగా ఈ బిల్లు క్రొత్తపన్ను విధాన మనే చెప్పాల్సి ఉంటుంది. ఈ బిల్లులో ఉన్న ప్రధాన సూత్రాలను చూచినపుడు Sales Tax లో ఇదివరకు ఉన్న ప్రతిఒక అంశ ముకూడా ఎక్కువ చేయడమే జరిగింది తప్ప తగ్గించడమనేది ఎక్కడా జరగలేదు. తెలంగాణాలో ప్రతి ఒక్కదానిమీద 100 కి 50, 100 కి 100 చొప్పున పన్నులు పెంచడం జరిగింది. ఆంధ్ర ప్రాంతంలో కూడా general గా 100 కి 28 చొప్పున పన్నులు పెంచడం జరిగింది. ఇదివరకు రూపాయికి 3 దమ్మిడీలు ఉన్నటువంటి పన్ను, ఇప్పుడు రూపాయకు 2 నయా పైసల క్రింద మార్చారు. అంటే దాని అర్థం ఇదివరకటి కన్న 100 కి 28 రూపాయల చొప్పున అదనంగా పన్ను పెంచడం జరిగింది.

అదే రీతిగా ఇదివరకు మూడు కానులు ఉన్నచోట అయిదు నయాపైసలు అంటున్నారు. ఈ విధంగాకూడా మళ్లీ పన్నులు పెంచడం జరిగింది. వీటి నన్నింటినీ నయా పైసలలోనికి మార్చేటప్పుడు—కేంద్ర ప్రభుత్వం ప్రక టించినటువంటి conversion table (మా రకపు పట్టీ పద్ధతిని) అను సరించి మేము ఇవన్నీ చేస్తున్నామని ఒకప్రక్కన ప్రకటించి చెబుతున్నారు. అయితే పర్యవసానం ఏమిటి? పన్నులను మాత్రం విపరీతంగా పెంచడం జరిగింది. ఈ విషయాన్ని ఎవరైనా గుర్తించకతప్పదు. కేంద్ర

ప్రభుత్వంవారు మారకం రేటును మార్చేటప్పుడు కానీకి రెండు నయా పైసలు, అణాకు ఆరు నయా పైసలు అని conversion table లో ఇచ్చారు. మన ప్రభుత్వం చేసేది ప్రతి దశలోనూకూడా conversion కోసం కాదు. ఇప్పుడు జరుగుతున్న వ్యవహారాన్ని ఇదే రకంగా సాగిస్తే ఒక మనిషి ఏదైనా కొనుక్కొన్నప్పుడుగాని, అమ్ముకున్నప్పుడుగాని, లేక పన్నులు కట్టే టప్పుడుగాని—ఆ పదం ఇక్కడ చెప్పలేదు అనుకోండి- అతని బాధ్యత ఎంత అనేది తెలుసుకొని అతడు మొత్తం ఎన్ని రూపాయలు కట్టవలసి ఉంటుంది, ఎంత చిల్లర కట్టవలసి ఉంటుంది, అనేది తేల్చిన తరువాత coversion table ను apply చేయాలని చెప్పారు. కేంద్ర ప్రభుత్వంవారు చేసిన సూచనలనుకూడా మన ప్రభుత్వంవారు త్రోసిపారేసి నయా పైసల లోనికి coversion పెట్టడం తప్ప మేము క్రొత్తగా ఏమీ చేయడము లేదు. కేంద్ర ప్రభుత్వంవారు ఇచ్చిన రేటు ప్రకారం చేస్తున్నామనే సాకు చెప్ప డము మాత్రం న్యాయం కాదు. ఇది కేంద్ర ప్రభుత్వం చెప్పినటువంటి, ప్రకటించినటువంటి మూల తత్వాన్నికూడా త్రోసిపారేసి ప్రజలమీద పన్నులు వేయడానికి అవకాశంగా తీసికొని, పన్నులు వేయడం తప్పితే మరొకటి కాదు. ఎక్కువ పన్నులను తీసుకుంటామని స్పష్టంగా చెప్పితే సరిపోతుంది.

" మేము conversion table ను బట్టి చేయడం లేదు ప్రభుత్వానికి డబ్బు కావలసి వచ్చింది కాబట్టి, అదనంగా పన్నులు వేస్తున్నాము " అని చెబితే సరిపోతుంది. గాని conversion table ప్రకారమే పెడుతున్నాము. దానిని బట్టి ప్రజలు ఎక్కువ డబ్బు ఇచ్చుకోవలసివస్తే మేము చేయగలిగిన దేమీలేదు అనే డొంకతిరుగుడు వాదన చేయడం ఎందుకు? ఈ నాణెముల మారకం విషయంలో ప్రధానంగా conversion table లో వచ్చిన చిక్కులివి అనేరీతిగా చెప్పడం మాత్రం చాల అన్యాయమని చెప్పక తప్పదు. అన్ని ప్రభుత్వాలు ఇదే రకంగా చేస్తున్నాయా అంటే, ఏ ప్రభుత్వంకూడా ఇట్లా చేయుటలేదు. మద్రాసు ప్రభుత్వంవారు Sales Tax Bill ను మొన్ననే ప్రకటించారు. పత్రికలలో వచ్చినదానిని బట్టి చూస్తే మామూలుగా రూపా యకు ఒక కానీ వసూలు చేసేచోట conversion table ప్రకారం రెండు నయా పైసలు చేయలేదు. నూటికి ఎంత శాతమో లెక్కచేసి, ఇదివరకు ఎంత పన్ను ఉన్నదో చూసి అంతే శాతం, $1\frac{9}{16}\%$ మాత్రమే మేము వసూలు చేస్తామనే రీతిగా వారు Sales Tax (Amendment) Bill తీసుకువచ్చారు. కాని, కానీకి దగ్గర రెండు నయా పైసలనే ధోరణిలో వారు హెచ్చించ

డానికి పూనుకోలేదు. కేంద్ర ప్రభుత్వం conversion table పెట్టింది, దీని ప్రకారం మేము ఎక్కువ చేస్తామనే దొంగ తిరుగుడు కారణమేమీ వారు చెప్పలేదు. ఇప్పుడున్న చట్ట ప్రకారం conversion table కూడా అదే రకంగా ఉన్నప్పుడు కానీకి 2 నయా పైసలు తీసుకోవలసి ఉంటుంది. కాని చట్టంయొక్క ఉద్దేశ్యం అదిగాదు. చట్టంయొక్క ఆశయాన్ని మనస్సులో పెట్టుకొని ప్రజలకు సౌకర్యం కలిగేటందుకు ప్రయత్నము చేస్తామని $1\frac{9}{16}$% చేయడం జరిగింది. వారి బిల్లుయొక్క Objects and Reasons యీ విధంగా ఉన్నవి.

"According to Section 14 (3) of the Indian Coinage Act, 1906 (Central Act III of 1906) as amended by the Indian Coinage (Amendment) Act 1955, (Central Act 31 of 1955) which came into force on April, 1, 1957, all references in any enactment to any value expressed in annas and pies shall be construed as references to that value expressed in terms of decimal coins, that is, Naya Payse, the fractions of which are rounded off to the nearest Naya Payse. This would have the effect of increasing the general rate of Sales Tax payable under the Madras General Sales Act, 1939 (Madras Act IX of 1939) from 1-9/16 per cent to 2 per cent. It is considered that the present rate of tax should be maintained notwithstanding the introduction of decimal coinage system. The Bill seeks to give effect to these proposals and to make other consequential changes necessitated by the new decimal system of coinage in the Madras General Sales Tax Act."

Coinage Act ప్రకారం ఇప్పుడున్నటువంటి Acts తో అదనంగా పన్ను వేయవలసిన పరిస్థితి చట్టరీత్యా వచ్చినట్లు ఉంటే - అసలు ముందు ఉన్నటువంటి చట్టంయొక్క ఉద్దేశ్యం ఆవిధంగా tax rates ను పెంచడం కాదు. ఇది coinage act కు విరుద్ధం కాకుండా వుండే రీతిగా ఇదివరకు వున్న tax rates ను మేము అమలు జరపడానికి పూనుకుంటామని మద్రాసు ప్రభుత్వం వారు సవరిస్తే, ఇక్కడున్నటువంటి ఆంధ్రప్రభుత్వం మాత్రం coinage act ను ఆధారంగా తీసుకొని పన్నులను పెంచడానికి ఇదొక మార్గంగా చూస్తున్నారు. అంతేకాదు. తెలంగాణా ప్రాంతంలోని పన్నులను ఇదివరకు ఆంధ్రప్రాంతంలోని పన్నుల స్థాయికి పెంచడమే కాక, ఇదివరకు 100 రు|| లు కట్టేటటువంటి వారిని ఇప్పుడు 128 రు|| లు కట్టే పరిస్థితికి తీసుకువస్తున్నారు. తెలంగాణా విషయం చూచినపుడు చాలా

దారుణంగా పన్నులను పెంచడం జరిగింది. వస్తువులన్నింటిమీద పన్నులు పెంచడం జరిగింది.

ఇదివరకు గుడ్డమీద తెలంగాణాలో 4.7% ఉండేది. ఇప్పుడు 9%కు పెంచటం జరిగింది. సన్నని, అతి సన్నని గుడ్డలమీద తెలంగాణాలో అర్ధణా పెట్టడం దానిని తరువాత ఒక కానీకి తగ్గించి, తరువాత second stage లో Multi point క్రింద ఇంకోసారి వేయడం జరుగుతోంది. దీనిమీద 3 కానులు పడితే రేపటి రోజున (ఇక ముందు) 1½ అణాల చొప్పున సన్నని గుడ్డమీద పెంచడం జరుగుతోంది. 4.7% నుంచి 9% దాకా గుడ్డలమీద పెంచడం జరుగుతోంది. సన్నని, అతి సన్నని గుడ్డలు-ఇవి బాగా డబ్బు ఉన్నవారు కట్టుకుంటారు- వారిమీద పన్నులు ఎక్కువ పడినా ఫరవాలేదు. అట్లాగైతే మేము అంగీకరించే వాళ్లం, సంతోషించే వాళ్లమే. కాని మామూలు మధ్య తరగతి medium cloth మీద ఈనాడు తెలంగాణాలో అర్ధణా ఉండేదానిని అణాకు పెంచడం జరుగుతోంది. గుడ్డల విషయంలో పై విధంగా చేస్తున్నారు. ఇదివరకు తెలంగాణాలో వంటచెరకు, కట్టెలు, బెల్లం, వ్యవసాయానికి కావలసిన రసాయనిక ఎరువులు (Mechanical fertilisers), చింతపండు, మిరపకాయలు బంగాళా దుంపలు మొదలైన వాటిమీద పన్ను ఉండేది కాదు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- ఉల్లిపాయలమీద ?

శ్రీ పి. సుందరయ్య:- ఉల్లిపాయలమీద ఉన్నదో, లేదో, వారు ఇచ్చిన చేట భాగములో వెతకడం కొంచెం కష్టంగా ఉన్నది. తెలంగాణాలో ఉల్లిపాయల మీదకూడ లేకుంటే లేకపోవచ్చు. శ్రీ గోపాలరెడ్డిగారికి ఉల్లిపాయలమీద అంత కసి ఎందుకో నాకు అర్థం కావడం లేదు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- తింటాను కాబట్టి.

శ్రీ పి. సుందరయ్య :- ఇదివరకు తెలంగాణాలో పన్నులేనటువంటి ఉల్లిపాయల మీదకూడా అదనంగా పన్నులు వేయడం జరుగుతోంది. అందుచేత, ప్రభుత్వం వారు కేవలం డబ్బుకోసం ఇదివరకు తెలంగాణాలో ఉన్నటువంటి పన్నులకు రెండు రెట్లు పన్ను అదనంగా వేయడం జరుగుతోంది తప్ప మరొకటి కాదు. మనం వచ్చీరాకముందే, దీనిని గురించి సమగ్రమైన అభిప్రాయానికి రాకముందే. ప్రజలలో మనం కలిగించేటటువంటి అభిప్రాయం ఏమిటి ? ఆంధ్రప్రదేశ్ రావడంతో వెంటనే పన్నులు పెరగడం జరుగుతోంది. అలాకాకుండా కొన్ని సంవత్సరాలు గడచిన తరువాత ఒప్పుకో

గలిగిన వారిమీద అధికంగా పన్నులువేసి మామూలు ప్రజల మీద అదనపు పన్నులు వేయకుండా ఉంటే ప్రజలకు సమాధానం చెప్పుకోడానికి, అభివృద్ధి పన్నులకొరకు ఇచ్చుకొనగలిగిన వారిమీద మేము పన్నులు వేశామని చెప్పితే కూడ ఉపయోగ ముంటుంది. ఆవిధంగా కాకుండా కట్టెలమీద, బెల్లంమీద, చింతపండుమీద, మిరపకాయలు ఉప్పుమీద, ప్రజల నిత్యావసరాలైన ఈ సరకులమీద, గోపాలరెడ్డిగారు శలవిచ్చినట్లుగా ఉల్లిపాయల మీద పన్నులువేసి మామూలు బీద ప్రజలలో అసంతృప్తిని కలిగిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ వచ్చిన తరువాత మీకు ఏమిలాభం జరిగిందయ్యా అన్నట్లయితే రోజూ వుపయోగించే వస్తువులమీద రెండు రెట్లు పన్నులు అదనం అయ్యాయనే రీతిగా ఉన్నది. మామూలు గుడ్డలమీద, అంటే ముతక గుడ్డలమీద, మధ్యతరగతి గుడ్డలమీద రెండురెట్లు పన్ను అధికం చేశామని స్పష్టంగా వెల్లడించడానికి ఈ బిల్లు పనికివస్తుంది తప్ప మరొకటి కాదు.

డాక్టరు బి. గోపాలరెడ్డి:- ఆంధ్రలో వేయవచ్చును, తెలంగాణాలో మాత్రం వేయ కూడదనా గౌరవసభ్యుని ఉద్దేశం? అక్కడ ఒకరకంగాఉండాలి, ఇక్కడ ఒకరంగా ఉండాలనేనా వారిభావం? ఇవన్నీ ఆంధ్రదేశంలో ఉన్నాయికాబట్టి ఈనాడు తెలంగాణాలోకూడా వస్తున్నాయి

శ్రీ పి. సుందరయ్య:- అక్కడవేరు ఇక్కడవేరు కానక్కరలేదు. ఆంధ్రలో ఉన్నాయికాబట్టి తెలంగాణాలో వేస్తున్నామని మంత్రిగారు చెబుతున్నారు. నాఉద్దేశం అక్కడకూడా తగ్గించాలనే. ఇంతచిన్నవిషయంలో గోపాలరెడ్డి గారికి ఎందుకు సందేహం వచ్చిందో నాకు అర్థంకావడంలేదు. ప్రజలుపయోగించే వస్తువులమీద పన్నులు తక్కువగాఉండాలని మాఉద్దేశం. ప్రజలంటే బీదప్రజలనే నాఉద్దేశం. బీదప్రజలు, మధ్యతరగతిప్రజలు తప్ప ధనవంతులను ప్రజలుగా చెప్పడానికి వీలులేదు. ధనవంతులకు ధనవంతులనేతప్ప సామాన్యప్రజలనేపేరును ఉపయోగించడం సరిఅయినది కాదనే నాఅభిప్రాయం. వారు 4, 5 శాతముకన్న ఉండరు. వారు ప్రజలమనేపేరుతో ప్రజలమీద పన్నులువేయించి, ప్రజల కేసౌకర్యాలు లేకుండా చేస్తుంటారు. అటువంటివారిని ప్రజలలోనుంచి లేకుండాచేస్తే ప్రజలు అనేపదంలో ధనవంతులను కలుపకుండాచేస్తే అన్నీ సక్రమంగా ఉంటాయని నాఅభిప్రాయం. 9 కోట్ల రూపాయలను పన్నుగా వసూలుచేసే ఈబిల్లును గురించి లోతుగా, సాకల్యంగా చర్చించకపోతే మనకర్తవ్యాన్ని నిర్వర్తించినట్లుకాదు. నాకు అన్నింటికన్నా ఆశ్చర్యంవేసేవిషయం మరొకటిఉన్నది. ఈ శాసనసభలో దాదాపు 215 మంది కాంగ్రెసు సభ్యులున్నారు. అన్నిసందర్భాలలోను వారిని

బలపరచేవారు ఇంకా 30, 40 మంది ఉన్నారు. 300 మందివరకుఉండే ఈసభలో 250 మందివరకు బలం ఉన్నపుడు మెజారిటీ విషయంలో ఎవరికీ ఎట్టిసందేహంలేదు. వారికిఇష్టంవచ్చినబిల్లును ఇష్టంవచ్చిన రీతిగా శాసనం చేయవచ్చును. ఏబిల్లుఅయినా ప్యాసవుతుంది అనటానికి సందేహంలేదు. ఇంతపెద్ద మెజారిటీతో పరిపాలన చేస్తున్నపుడు మెజార్టీ ఉన్నదికాబట్టి పరిపాలన చేస్తున్నాము అనికాక సామాన్యప్రజల, పేదప్రజల కష్టాలను కొంతవరకయినా ఆలోచించగలిగే స్థితిలోనే ఉన్నాము. అంతేకాని ధనవంతుల రాజ్యం కోసమే మేము అనే అభిప్రాయం కలిగేటట్లయినా ఈ బిల్లును తీసుకురాలేదే అని నాకు ఆశ్చర్యంగా ఉన్నది. తెలంగాణాలో పన్నులు రెండురెట్లు ఎందుకు పెంచుతున్నారని అడుగుతున్నానంటే మరొక విషయం కూడా ఆలోచించండి. రెండు ప్రాంతాలను సమన్వయంచేయాలి; ఒకే అభిప్రాయానికి తీసుకురావాలి; శతాబ్దాలుగా వేరు వేరుగా ఉన్నందువల్ల వచ్చిన విడిపోక ధోరణులు పోగొట్టాలి; దానికి కొంత కాలం పడుతుంది— ఈ విధంగా ఆరంభించి ఆంధ్రప్రదేశ్ వచ్చీరాకముందే తెచ్చిన మొదటి బిల్లు ఏమంటే సామాన్య ప్రజలుపయోగించే మామూలు వస్తువులుమీద రెట్టింపు పన్ను విధించే బిల్లు. ఈ పద్ధతి ఆంధ్ర దేశాన్ని ముందుకు తీసుకు పోయే పద్ధతికాదని చెప్పవలసియున్నది. ఒక ప్రక్క ఉన్నఅనుమానాలు పోగొట్టాలని, దానికి కాలం పడుతుందని కాంగ్రెసు ప్రభుత్వం చెబుతోంది. మరొకవైపు దానికి ప్రత్యక్ష విరుద్ధంగా, దానికై కాలం తీసుకోకుండా, ప్రజలను దానికి తయారు చేయకుండా, సామాన్య ప్రజలకు నష్టకరమైన రీతిగా పన్నులను పెంచే పద్ధతి అనుసరిస్తున్నారు. ఇది ఏ మాత్రం సమ్మతమైనది కాదని చెప్పకతప్పదు. అభివృద్ధి కార్యక్రమాలకై పన్నులు వేసేటప్పుడు సేల్సుటాక్సు ఒకటేతప్ప మరొక మార్గంలేదా అనేది ఆలోచించాలి. మన రాష్ట్రంలో అదనంగా పన్నులు వేసుకోవలసిన అవసరం ఉన్నదా అని నాకు అనుమానం ఉన్నది. మన రాష్ట్రంలో ఎన్ని పన్నులు వేసుకున్నా ఆదాయంలోని లోటును (revenue deficit) భర్తీ చేసుకొన గలమా, ప్రజల కార్యక్రమాన్ని ముందుకు తీసుకుపోగలమా అని అనిపిస్తోంది. కేంద్ర ప్రభుత్వం అనుసరించే పన్నుల విధానం చూస్తే రాష్ట్రాల స్వపరిపాలన అనేది కేవలం బూటకం అయిపోయింది; నామమాత్రం అయిపోయింది అని చెప్పవలసియున్నది. జిల్లాబోర్డులకన్న కనిష్టమైన స్థితిలోనికి రాష్ట్రాలు వచ్చాయని మరొక పర్యాయం చాలా గట్టిగా చెప్పవలసియున్నది. రాజ్యాంగ చట్టం ప్రకారం బాగా ఆదాయంవచ్చే పన్నులన్నీ కేంద్ర ప్రభుత్వంవారి చేతులలోనికి పోయినాయి. ఉత్పత్తిమీద పన్నులు, Excise taxes, ఎగుమతి

దిగుమతి సుంకాలు (customs duties), ఆదాయంమీద వేసే పన్నులు—ఈ విధంగా ఆదాయం బాగా వచ్చే పన్నులు, ఇచ్చుకో గలిగిన ధనవంతుల మీద వేసే పన్నులు అన్నింటిని కేంద్ర ప్రభుత్వం తన చేతులలో పెట్టుకున్నది. రాష్ట్ర ప్రభుత్వాలకు ఇచ్చినది ఏమంటే, అమ్మకం పన్ను, భూమి మీద విధించేపన్ను, వినోదాలు, కాలక్షేపాలు, సినిమాలు మొదలైన వాటిమీద వేసే పన్ను; కల్లు తాగితే దానిమీద వేసేపన్ను; పొగాకు తాగితే దానిమీద వేసేపన్ను—ఇటువంటి సామాన్య ప్రజలుపయోగించే మామూలు వస్తువులమీద వేసేపన్నులు మాత్రం రాష్ట్రాలకు ఇచ్చారు. ధనవంతులమీద వేసే పన్నులు, ఎక్కువ ఆదాయంవచ్చే పన్నులన్నింటిని కేంద్ర ప్రభుత్వం వారు తమ చేతులలో పెట్టుకున్నారు. రాజ్యాంగమే ఆ విధంగా తయారు చేశారు అంతటితో ఆగలేదు. రాష్ట్ర ప్రభుత్వాలకు ఇచ్చిన ఆ కొద్దిపాటి పన్నుల విషయంలోకూడా క్రమేణా ఒక చట్టం తరువాత మరొక చట్టంతెచ్చి అధికారాలు ఊడగొట్టి కేంద్రప్రభుత్వం తానేతీసుకొంటోంది. ఉదాహరణకు అమ్మకం పన్ను విషయమే తీసుకుందాము. శ్రీ గోపాలరెడ్డిగారు, అంతకు ముందు శ్రీ రాజగోపాలాచారిగారుకూడా అమ్మకం పన్నును కామధేనువు అని అన్నారు. తెగపిండుతుంటే ఆ కామధేనువే కరువు దేవత క్రింద తయారైతే ఆశ్చర్యంలేదు. అమ్మకం పన్ను విషయంలో జరిగింది ఏమిటి? అంతర్ రాష్ట్ర అమ్మకం పన్ను (inter states sales tax) విషయంలో సుప్రీంకోర్టు ఒక తీర్పు చెప్పినది. ఒక రాష్ట్రంలో అమ్మిన సరుకును మరొక రాష్ట్రంలో కొనుక్కుంటే, భారత దేశం అంతా ఒకటే దేశం కాబట్టి, రాష్ట్రాలమధ్య వ్యాపారం జరిగే వస్తువులకై రాష్ట్రం పన్ను వసూలుచేస్తే తప్పు అవుతుంది అనే అర్థంచెప్పి, అటువంటి అమ్మకాలపై పన్ను వసూలు చెయడం నిషేధిస్తూ సుప్రీంకోర్టు తీర్పుచెప్పినది. అటువంటి సందర్భాలలో ఏ పన్నూ చెల్లించకుండా పోతారనే అభిప్రాయంతో కేంద్ర ప్రభుత్వం అంతర్ రాష్ట్ర అమ్మకం పన్నుకు సంబంధించి ఒక చట్టాన్ని తీసుకు వచ్చింది. వివిధ రాష్ట్రాలమధ్య వర్తక వ్యాపారాలకు పనికివచ్చే వస్తువులలో ముఖ్యమైనవాటి ఇష్టం వచ్చినప్పుడు కేంద్రప్రభుత్వం ప్రకటిస్తే వాటిని declared goods చేస్తే - వాటిమీద 2% అంటే రెండు నయాపైసలకన్న ఎక్కువపన్ను వేయటానికి వీలు లేదని చట్టంతెచ్చినది. దీనిఅర్థం ఏమిటి? అంతర్‌రాష్ట్ర అమ్మకంపన్ను అనేపేరుతో రాష్ట్రాలకు అమ్మకంపన్ను విషయమై ఉన్న అధికారాలను పరిమితం చేశారన్నమాట. ఒకరాష్ట్రంలో అమ్మినసరుకు మరొకరాష్ట్రంలో

కొనుక్కున్న సందర్భంలో ఆవస్తువులపై పన్ను వసూలుచేయరాదని సుప్రీం కోర్టు తీర్పుఇస్తే, రాజ్యాంగాన్ని సవరించి పన్నులను వసూలుచేసే విషయంలో రాష్ట్రాలకుగల హక్కులను, అధికారాలను కాపాడటానికి బదులు, ఆతీర్పును అవకాశంగా తీసుకొని రాష్ట్రాలకుఉన్న అధికారాలను కేంద్ర ప్రభుత్వమే తీసుకున్నది. తీసుకొని రాష్ట్రాలకు ఆదాయంవచ్చే వస్తువుల జాబితానుంచి తీసివేసింది. అట్లా రాష్ట్ర జాబితాలోనుంచి తీసివేసిన వస్తువులు పొగాకు, ఉక్కు, ఇనుము, నూనెగింజలు, జనపనార, దూది, తోళ్ళ పరిశ్రమలు వీటన్నిటినికూడా కేంద్రప్రభుత్వం తీసుకొని వీటిమీద 2% కన్న ఏ రాష్ట్రప్రభుత్వముకూడా పన్నువేయడానికి వీలులేదన్నారు. అంతకంటే తక్కువపన్ను వేసుకుంటే వేసుకోవచ్చుగాని 2% కంటె ఎక్కువ వేయడానికి వీలులేదని ఆవస్తువులను కేంద్రప్రభుత్వం రాష్ట్రజాబితాలోనుంచి తొలగించింది. ఎగుమతులు, దిగుమతుల పేరుతో ఎగుమతిచేయడానికి పనికివచ్చే ఏవస్తువుమీద కూడా పన్ను వేయకూడదని చట్టంచేసినది. అంతేకాకుండా యీరోజు గుడ్డల మీద, చక్కెరమీద, పొగాకుమీద యిదివరలో రాష్ట్రాలు అమ్మకంపన్ను వేసుకుంటూవుంటే అదికూడా యిదమిద్ధమనిలేకుండా దానివల్లకూడా ఎక్కువ ఆదాయము రాలేదనేపేరుతో ఒకరాష్ట్రంవేస్తే ఎక్కువవేస్తుంది, రెండో రాష్ట్రం వేయడంలేదు. ఆపేరుతో కేంద్రమే "కొన్ని ఉత్పత్తి (Excise) పన్నులువేస్తాం, వేసి ఆపన్నుద్వారా రాష్ట్రాలకు దామాషామీద పంచిపెడతాం" అనేపేరుతో ఆవస్తువులపై అమ్మకంపన్ను రాష్ట్రాలువేసే అధికారాలనుంచి తీసివేయడం జరుగుతుంది. ఈరీతిగా బాగా పన్నుభరించి కాస్తఆదాయం రాష్ట్రాలకు రావడానికి వీలుగావున్న వస్తువులను అమ్మకపుపన్ను జాబితా నుంచి తొలగించడం కేంద్రప్రభుత్వం చేస్తున్నది. ఇక విలాసవస్తువులమీద అదనంగా పన్ను వేసుకోవచ్చు. విలాసవస్తువుల జాబితాలో 17 వస్తువులను ఒకటవ షెడ్యూలులో యిచ్చారు. వీటినిగురించి మామూలుపన్నుకంటె 5%, 3% చొప్పున అదనంగా పన్నులు single point tax క్రింద వేయవచ్చునని షెడ్యూలులోఉన్నది. అంతకన్న ఎక్కువ వేయటానికి వీలున్నదాఅంటే అదిసాధ్యముకాదు. ఎందుకోసమంటే ఒకరాష్ట్రంలో విలాసవస్తువులమీద అనగా బంగారం, మోటారుకార్లు, గ్రామఫోను, రేడియోలవంటి వస్తువులపై అదనంగా పన్నులువేస్తే, రెండోరాష్ట్రంలో అదనంగా వేయకపోతే వాటిని కొనేటటువంటి ప్రజలు, దగ్గరనున్న మద్రాసుకో, కలకత్తాకో, బొంబాయికో వెళ్ళి ఆరాష్ట్రంలో కొనుక్కొనివస్తారు. వాళ్ళు డబ్బున్నవాళ్ళు కనక రైలు ప్రయాణపుఖర్చు సమస్యకాదు, ఇక్కడ పన్నుకట్టుకునేదానికన్న చౌకగా పక్కరాష్ట్రంలో కొంటారు. కనుక ఏఒక్క రాష్ట్రంలోనో విలాసవస్తు

వులమీద పన్నువేయడంవల్ల మనకు ఎక్కువడబ్బు రాదు. ఆకారణంచేత విలాసవస్తువులమీద ఎక్కువపన్ను వేయడానికి వీలులేదు, ఎక్కువపన్నువేస్తే యిప్పుడువచ్చే ఆదాయముకూడా పోతుంది. కాబట్టి నష్టంతప్ప యింకోటి లేదని ఏరాష్ట్రానికారాష్ట్రం యీ విలాసవస్తువులమీద పన్ను తగ్గించడానికి పూనుకుంటుంది. ఇది Sales Tax Enquiry Commission ముందువచ్చిన సమస్య. ప్రతిరాష్ట్రప్రభుత్వంముందు వచ్చినసమస్యయిదే. కాని నేనుఅడిగే సమస్య ఏమంటే కేంద్రప్రభుత్వానికి నిజంగా డబ్బుకావాలంటే ప్రజలుపయోగించే వస్తువులపై ఏరాష్ట్రంకూడా ఎక్కువపన్ను వసూలు చెయకూడదని చెప్పకుండా విలాసవస్తువులపై పన్నువేసేఅధికారం కేంద్రప్రభుత్వమే తీసుకొని, యింతకన్నా అదనంగా excise పన్నువేసి, ఆ వచ్చినపన్నును అన్ని రాష్ట్రాలకు దామాషాని పంచిపెట్టడానికి ఎందుకు పూనుకోకూడదు? ఆదాయం ఎక్కువవచ్చే ఉక్కు, పొగాకు, జనపనార, దూదిమీద 2°/° కంటె ఎక్కువపన్ను వెయగూడదని శాసించడం, విలాసవస్తువులను కేంద్రప్రభుత్వం అసలు తీసుకోకపోవడం. తీసుకున్నవిగూడా ప్రజలకుపయోగించే చక్కెర, గుడ్డలను కేంద్రప్రభుత్వం తీసుకోవడం చూసినట్టయితే ఏమనుకోవాలి? ధనవంతులపైన పన్నువేయడానికి కేంద్రప్రభుత్వానికిష్టంలేదు. రాష్ట్ర ప్రభుత్వాలకు ధనవంతులపై పన్నులు వేయడానికి అవకాశం లేకుండా చూడాలి. సాధారణంగా విలాసవస్తువులమీద పన్ను వేయడానికి వీలు లేదు. కాబట్టి వాటిమీద ఎక్కువపన్ను వేయడానికి ఎటువంటి శ్రద్ధా తీసుకోవడంలేదు. ఇక రాష్ట్ర ప్రభుత్వాలకు మిగిల్చింది ఏమిటంటే చింతపండు, మిరపకాయలు- శ్రీ గోపాలరెడ్డిగారి కిష్టమైన ఉల్లిపాయలు—యిటువంటి వస్తువులు మాత్రం "మీ రాష్ట్రాలకు యిచ్చేస్తాం, మా ధనవంతులకు యిబ్బంది లేదు" అంటున్నారు కేంద్ర ప్రభుత్వంవారు. అందుచేత రాష్ట్ర ప్రభుత్వాలలో యిటువంటి పన్నుల నెక్కువ చేసే బిల్లులు వచ్చినప్పుడు ప్రజా ప్రతినిధుల కర్తవ్యం ఏమిటంటే కాంగ్రెసు ప్రభుత్వం ఎన్ని సాకులు చెప్పినా అభివృద్ధికోసం పన్నులు వేయాలని కారణం చెబితే యీ కారణం బూటకపు కారణమనీ పన్నులు వేయాల్సిన వారిమీద కేంద్రప్రభుత్వమూ, రాష్ట్రప్రభుత్వాలు పన్నులు వేయడం లేదని బీదలపైన వేసే యీపన్నుల విధానంకు పూర్తిగా వ్యతిరేకులమని చెప్పడమే ప్రజా ప్రతినిధుల కర్తవ్యము. పేదవారిపై వేసే పన్నులను వ్యతిరేకించక తప్పదు. ధనవంతులపైన పన్నులు వేసి వసూలు చేసి సక్రమంగా ఖర్చు పెడుతూంటే యింకా డబ్బు కావాలంటే అప్పుడు తిన తిండి లేక కటకటలాడే ప్రజలను పన్నులను భరించమంటే అర్థం వున్నది. కాని అది చేయకుండా విలాస వస్తువులమీద

ఎక్కువ పన్నులు వేయడానికి వీలులేదు; ఇనుము, ఉక్కు జనపనారలమీద ఎక్కువ పన్ను వేయడానికి వీలు లేదు; ఇక పన్ను వేయగలిగిందేమిటంటే బియ్యం, ఉప్పు, కారము, ఉల్లిపాయలు. వీటిమీద పన్నులు వేదామనుకున్న ప్రభుత్వం ప్రజా ప్రభుత్వం అనిపించుకోదు. అటువంటి పన్నులకు వ్యతిరేకులమని చెప్పుకోవడం తప్ప యింకోటి చేయగలగింది లేదు. మీ వ్యతిరేకతను గమనించకుండా మాకు మెజారిటీ వుందని పన్నులు వేసుకుంటూపోతే ఆ తరువాత వాళ్ళు, ప్రజలు ఆలోచించుకోవలసి వుంటుంది. ఈ అమ్మకం పన్ను విషయమే కాదు. పన్నుల విధానం తీసుకుందాము. మోటారుబండ్లమీద కొన్ని పన్నులు వేస్తారు. దానికి గూడా కేంద్రం Motor Vehicles Centralization Act ను తయారుచేసి వాటిమీదకూడా రాష్ట్రాలకు ఎక్కువ పన్ను వేసే అధికారం లేకుండా, కేంద్ర ప్రభుత్వమే ఆ అధికారాన్ని తీసుకున్నది. భూమి పన్ను విషయం తీసుకుంటే, రాష్ట్రాలే భూమి పన్ను వేయాలని వుంది, కాని రాష్ట్ర ప్రభుత్వాలకు ఎక్కువ ఆదాయం వచ్చే విధంగా వ్యవసాయపుటాదాయంపై పన్ను (Agricultural Income Tax) వేయడానికి ప్రభుత్వం తయారవుతుందా ? తెలంగాణాలో వున్నది కనుక ఆంధ్రలో వేద్దామంటే పదిలక్షల రూపాయలైనా ఆదాయం రాదు, కనుక పన్ను వేసి లాభంలేదంటే అర్థం ఏమిటి ? వంద ఎకరాలున్న భూస్వాములు తమ భార్యలపేర, మిత్రులపేర దస్తావేజులు వ్రాసి తమ పేర పది ఎకరాలు మాత్రమే ఉంచుకొని పది ఎకరాలకంటె ఎక్కువ లేదని రికార్డులు తయారుచేసుకుంటే అలాంటి రికార్డులతోనే భూమి లెక్కలు తీసి ఆంధ్రదేశంలో ఎక్కువ ఆదాయంవచ్చే భూస్వాములు లేరని, అందువల్ల దానిపై పన్నువల్ల ఆదాయంరావంటున్నారు. ఈ రకంగా పన్ను ఎగవేసేటటువంటి పెద్ద భూస్వాములకు తోడ్పడకుండా ఖచ్చితమైన లెక్కలు తీసి పన్నువేయాలి. అలా చేయకుండా, తేలికగా నోరు లేని ప్రజలపై అమ్మకపు పన్ను వేస్తున్నారు. Excise duties మీద ఎక్కువ పన్ను వేసి slab rate పెంచి కేంద్ర ప్రభుత్వం వసూలు జేసి రాష్ట్రాలకు పంచుతున్నట్లే మామూలు Income Tax తో Agricultural Income Tax జతజేసి slab rate పెంచి, వచ్చిన ఆదాయం రాష్ట్ర ప్రభుత్వాలకు కేటాయించాలని మన రాష్ట్ర ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వాన్ని ఎందుకు అడగకూడదు ? ఆ రీతిగా జేయకుండా కాస్తో కూస్తో వచ్చే ఆదాయాన్ని కేంద్ర ప్రభుత్వం వదలకుండా మామూలు పేద ప్రజానీకం మీద పన్ను వేయదలచే యీ పన్ను బిల్లుకు విలువ వున్నదా ? దానికి 'ఊ' కొట్టి

అంగీకారం తెలియజేయడం మావల్ల కానిపని. ప్రజల ముందుకు పోయి అభివృద్ధికి మార్గమీ పన్నులేనని చెప్పడానికి తయారుగా లేము. ఇతర రాష్ట్ర ప్రభుత్వాలూ, కేంద్ర ప్రభుత్వమూ అనుసరించే టప్పుడు ఆర్థిక విధానంవల్ల ధనవంతులమీద పన్ను వేయకుండా బీదలమీద పనిగట్టుకు పన్నులు వేస్తున్నారని చెప్పగలం. ఏ దైనా పరిశ్రమ పెట్టుకొని ఆదాయం పెంచుకొందామనిచూస్తే పబ్లిక్ సెక్టారు, ప్రైవేటు సెక్టారు వుంది. రాష్ట్ర ప్రభుత్వములు సిమెంటు పెట్టుకోకూడదు, చక్కెర పెట్టుకోకూడదు, ఎందుకంటే లాభాలురావు. ప్రజలలో ఎక్కువ ఖర్చు అయ్యే వస్తువులు ప్రభుత్వము తయారుచేస్తే లాభాలు రావు. అవే వ్యక్తిగతంగా పెట్టుబడిదార్లు పెట్టుకొంటే వారికి లాభాలు వస్తాయి. అందుచేత వాళ్ళనే పెట్టుకోనివ్వండి. లాభాలు వారినే తీసికోనివ్వండి. స్వయంగా, ఎక్కువ పెట్టుబడితో ఎక్కువ కాలం ఆగవలసినటువంటి పెద్ద పెద్ద పరిశ్రమలు (ఉక్కు పరిశ్రమలవంటివి) ప్రభుత్వం పెట్టుతుంది. అవి పెట్టడానికి రాష్ట్ర ప్రభుత్వానికి కేంద్ర ప్రభుత్వం సహాయంచేస్తుంది. సిమెంటు ఫ్యాక్టరీ రాష్ట్రపభుత్వం పెట్టటానికి వీలులేదని ఒక అడ్డంకువస్తుంది. Sales Tax చూచినా, మోటారు వెహికిల్స్ టాక్సు చూచినా, విలాస వస్తువులపైన టాక్సు చూచినా, లేక పరిశ్రమలను చూచుకొన్నా నిజంగా అవి బీద ప్రజానీకంమీద, సామాన్య ప్రజానీకంమీద పన్ను పెరుగకుండా, ఇచ్చుకోగల్గిన వారిపై వేయటం కోసం ప్రభుత్వం పూనుకోకపోయినపుడు, బీద ప్రజలమీద, వారు ఉపయోగించే వస్తువులమీద ఈ రీతిగా భారం పెట్టినప్పుడు, దానిని వ్యతిరేకించటం ప్రజాప్రతినిధుల యొక్క కర్తవ్యం. ఆ దృష్టితో చూచినపుడు ప్రజలమీద పడే ఈ Sales Tax బిల్లుపై ప్రతి క్లాజుమీద సవరణలు ప్రతిపాదించి దానిని వ్యతిరేకిస్తాము. "250 మంది వున్నాము, మీరు వ్యతిరేకించినా లాభంలేదని" అంటే అనవచ్చు. అయినా మా నైతిక బాధ్యత మేము నెరవేర్చడానికి ఆ విధంగా చేయక తప్పదు. కనుక ఈ విషయం మరొకసారి తీవ్రంగా ఆలోచించమని రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ముఖ్యమైన అధికారా లన్నీ కేంద్రప్రభుత్వం తీసుకొంటున్నప్పుడు, ప్రజలకు కావలసిన విద్యా, వైద్య సదుపాయములు, వ్యవసాయాభివృద్ధి, రాకపోకల సౌకర్యాలు వీట న్నింటినికూడా రాష్ట్ర ప్రభుత్వముల బాధ్యతక్రింద వదిలేసినపుడు డబ్బు కావలసివుంటే కేంద్రప్రభుత్వం చూచుకొంటుంది. అదంతావున్నప్పుడు ఈ పన్నుల నాటకము ఎందుకు? కేంద్రంలో మీకు మెజారిటీ వుంది. దాదాపు ముఖ్యమైన పన్నులన్నీ మీరే వసూలు చేస్తున్నారు.

మిస్టర్ స్పీకర్:- స్కీము ఆఫ్ టాక్సేషన్ అంతా review చేయడం ఇప్పుడు relevant కాదేమో ; Sales Tax అసలు వేయవద్దని కాకుండా ఈప్రభుత్వం ఏఏ పన్నులువేస్తే బాగుంటుంది, ఏఏ విధానాలుండాలి, Central Government, Central Legislature, పార్లమెంటు ఏఏపన్నులు వేయాలి, ఇక్కడ ఏఏ పన్నులు వేయాలి అని whole scheme review చేయడం బడ్జెటుచర్చలో అయినా బాగుంటుందేమోగాని ఈ Sales Tax బిల్లు చర్చపై బాగుండదు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- Constitution ను శంకించటం అవుతుంది.

మిస్టర్ స్పీకర్:- శంకించటంగురించి నేను బాధపడను. Constitution తప్పన వచ్చును. ఆ అధికారము మీకువుంది. మీరుకొంచెం touch చేశారు. అది చాలేమోనని సుందరయ్యగారికి నేను point out చేస్తున్నాను.

SRI E. AYYAPU REDDI (Nandikotkur-General):- Point of order, Sir.

శ్రీ పి. సుందరయ్య:- స్పీకరుగారు చెప్పినదానికి point of order తెస్తున్నారా ?

శ్రీ ఇ. అయ్యపురెడ్డి:- అవును.

మిసర్ స్పీకర్:- It will come under contempt of the Speaker.

Will the hon. Member resume his seat ? Otherwise I will have to take action for contempt.

శ్రీ ఇ. అయ్యపురెడ్డి:- తమరు చెప్పినదానిపైన point of information.

MR. SPEAKER:- The ruling cannot be questioned and cannot be discussed. Therefore I request the hon. Member to resume his seat. I have given a ruling that he cannot discuss that way.

SRI E. AYYAPU REDDI:- I am seeking an explanation, Sir.

శ్రీ పి. సుందరయ్య:- Point of order కు తప్పితే మరోదానికి నేను కూర్చు అవసరంలేదు. నేను కూర్చున్నతర్వాత యింకొకరు మాట్లాడటం సభాసాంప్రదాయము. మధ్యలో ప్రశ్నలు వేయవచ్చు. నాయిష్టంఅయితే సమాధానం. చెప్పవచ్చు. కాని నేను yield కానంతవరకు వారు మాట్లాడగూడదు.

మిస్టర్ స్పీకర్:- Point of information order క్రింద తీసుకువచ్చినట్లు కన్పిస్తోంది. We express our opinions that the Constitution should be framed in a different way and so on. ఇంకోవిధంగాఉంటే బాగుంటుందని చెప్పటంవల్ల Constitution ను disobey చేశామనికాని, దానికి వ్యతిరేకంగా వున్నామనికాని ఏమీఅర్థంకాదు. ఇదికాకుండా ఏదైనా కావాలంటే అడగండి.

శ్రీ ఇ. అయ్యపురెడ్డి :- Constitution ను శంకించవచ్చు. దానికి నాకు బాధలేదని చెప్పారు. ప్రతిశాసనసభ్యుడు ఇక్కడ oath తీసుకొన్నప్పుడు "Constitution ప్రకారము నేను దానిని ఒప్పుకొంటాను" అని oath తీసుకుంటున్నారు. కాని ఈ శాసనసభలో Constitution ను శంకించుతూ మాట్లాడటం అనేది oath కు విరుద్ధం. కనుక తమరు దానిని వివరించవలసిందిగా కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ :- Oath కు విరుద్ధం కాదు. మారిస్తే బాగుంటుంది, యింకోవిధంగా వుంటే బాగుంటుందని అన్నారుగాని, "నేను ఈ Constitution ను ధిక్కరిస్తున్నాను, ఈ constitution పనికిమాలినది అందులో ఏమీలేదని" అన కూడదు. ఈ రకపు provision వుంటే బావుండును అనే విధంగా చెప్పడానికి అధికారము వుంది. అది ధిక్కరించటం క్రిందకు రాదు.

శ్రీ పి. సుందరయ్య:- రాష్ట్ర ప్రభుత్వము, కేంద్ర ప్రభుత్వం ఈ పన్ను విధానంగురించి సూచించినదానిని ప్రస్తుతం మనకు సంబంధించినంత వరకు నేను తీసుకువస్తున్నాను. వాటన్నింటిలోకి లోతుగా వెళ్ళినట్లయితే మూడు రోజుల్లో, దానికి కావలసిన మెటీరియల్‌తో, చెప్పింది చెప్పకుండా ఈ పన్ను విధానాలను గురించి చర్చించడానికి కావలసిన సామగ్రి కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రకటించిన రిపోర్టులో వున్నాయి. వాటి జోలికి నేను పోవడము లేదు. దాన్ని గురించి తీవ్రంగా ఆలోచించమనే నేను ఈ ప్రభుత్వాన్ని కోరేది. అసలు మన వాదము అంతా ఏమిటి ? గవర్నమెంటువారు తెచ్చే వాదం ఏమిటి ? మన రాష్ట్రంలో అభివృద్ధి కార్యక్రమాలను సాగించి ప్రజలకు కావలసిన సౌకర్యాలను కలుగజేయాలంటే పన్నులు ఎక్కువ వేసుకోవాలి. పన్నులు ఎక్కువ వేయాలంటే sales tax ను ఎక్కువ రేటు పెంచుకోవాలి. మన ఆదాయంలో దాదాపు నాలుగో వంతు ఈ బీద ప్రజల నుండి వచ్చేది. మన ఆదాయం అభివృద్ధి కావాలంటే పన్నులు ఎక్కువ వేసుకోవాలి. అది తప్ప వేరే మార్గం లేదని చెబుతున్నారు. మన ఖర్చులకు కావలసిన పన్నులు మనం వసూలుచేసుకోలేము. మనము ఎంత వెనుకబడితే మన ఆదాయము అంత తక్కువగా ఉంటుంది. మనకు ఆదాయం వచ్చే పద్ధతులన్నీ కేంద్ర ప్రభుత్వమే తీసికొంది. ఇదివరకు రాష్ట్ర ప్రభుత్వాలకు ఇచ్చిన పన్నుల అధికారము కేంద్ర ప్రభుత్వం తీసుకొంటూవుంది. మనకు మిగిలింది బీద ప్రజలమీద అదనంగా వేసే పన్ను తప్పితే మన దగ్గర యింకేమి లేకుండా అన్నీ కేంద్ర ప్రభుత్వమే తీసుకొంది. 100 కి 99 మంది వున్న బీద ప్రజల జీవిత స్థాయిని పెంచడానికి బదులు ఇటువంటి పరిస్థితు

లలో వారిపై అదనంగా పన్ను వేస్తున్నారు. "అన్ని పన్నులు మీరే వసూలు చేయండి. వసూలు చేసి జనాభాను బట్టి మా దామాషా మాకు పడేయండి. మేము వెనుకబడియున్నట్లయితే అభివృద్ధి చెందిన రాష్ట్రాలలోవలె విద్యా సౌకర్యము, వైద్య సౌకర్యము, పరిశ్రమల అభివృద్ధి, ఉద్యోగ అవకాశములు కలుగ జేయండి. కేవలం దామాషా కోసమేకాదు, వెనుకబడిన రాష్ట్రాలను ముందు వున్న రాష్ట్రాలతోపాటు తీసుకువచ్చేదానికి కొంచెం అదనపు డబ్బు ఇవ్వవలసి వుంటుందని" చెబితే ఈ పన్నుల బాధ వుండదు. ఆ రీతిగా కేంద్ర ప్రభు త్వంవారి వద్దనుండి హెచ్చు డబ్బు తెచ్చుకొంటే యీ విధంగా పన్నులు వేయవలసిన బాధ వుండదు. ఎవ్వరూకూడా యీ ప్రభుత్వాన్ని నిందించ వలసిన అవసరం వుండదు. ఉద్యోగస్థులకుకూడా కేంద్ర ప్రభుత్వంవారి జీతాలు వస్తాయి. మనం ముందుకు పోవడానికి వీలు వుంటుంది. ఆదాయం రాని పన్నులను రాష్ట్ర ప్రభుత్వాలు వుంచుకొని రాష్ట్రాన్ని ముందుకు తీసుక పోతామని చెప్పడంలో అర్థం లేదు. "యీ పన్నులన్నీ మీరే వసూలు చేసు కొని మా జనాభా దామాషానుబట్టి, మా వెనుకబడిన తనాన్ని బట్టి మాకు డబ్బు యివ్వమని" మనం కేంద్ర ప్రభుత్వాన్ని అడగడం మంచిది. యిది చాలా మంచి మార్గం. కనీసం రాష్ట్ర ప్రభుత్వం యీ తిట్లు తినకుండా కేంద్ర ప్రభుత్వం తినడమే మంచిది. ఈ విషయం రాష్ట్ర ప్రభుత్వం యోచించవలసినదని కోరుతున్నాను.

సేల్సుటాక్సు సూత్రాలను గురించి యీ సంగతి వచ్చినప్పుడు మా దృక్ప థమేమో స్పష్టంగా చెప్పదలచాం. ఇది బీద ప్రజలమీద అదనపు పన్నులను విధించడం తప్పితే ధనవంతులమీద పన్ను విధించడం మాత్రం కాదని మనవి చేస్తున్నాను. దీనిని మేము తీవ్రంగా వ్యతిరేకించక తప్పదు. ఇటువంటి బిల్లుకు ప్రజా ప్రతినిధుల సహకారం పొందడం అసంభవమని మాత్రం నేను చెప్పవలసి వున్నది.

ఇక పన్నురేటు గురించి మనవి చేస్తాను. 'గుడ్డిలో మెల్ల' అన్నట్లు ప్రభు త్వంవారు అవలంబిస్తున్న విధానం మాకు ఎంత అసంతృప్తికరంగా వున్న ప్పటికీ, చేతనైనంత సహాయం ప్రజలకు చేద్దామనే సంకల్పంతోనే సెలక్టు కమిటీలో వుండుటకు మేము అంగీకరించాము. యిచ్చుకోగలవాళ్లపైననే పన్ను విధించాలని పేద ప్రజలపై పన్ను భారం కొంతవరకైనా తగ్గించడం అవసరమని తెలియజేస్తున్నాను. సేల్సుటాక్సు ఎంక్వయిరీ కమిటీలో ప్రతి పక్షంనుంచి ఒకరిని మాత్రమే నియమించినప్పటికీ ఏదో విధంగా ప్రభు త్వానికి నచ్చజెప్పి పేద ప్రజలకు కొంత సహాయం చేద్దామనే దృఢ సంక ల్పంతోనే అందులోకూడా పాల్గొన్నాం. పేదప్రజలపై కొంతవరకైనా

పన్నులభారం తగ్గించవలెననే సంకల్పంతో చేయబడిన మా సూచనలన్నీ నిరాకరింప బడ్డాయి. ఈ బిల్లును చర్చిస్తున్న సందర్భంలో సేల్సుటాక్సు యొక్క చరిత్రగురించికూడా మరొకపర్యాయం సభ్యులకు జ్ఞాపకం చేయ వలసియున్నది. 1937—39 సం. లలో సేల్సుటాక్సు ఆరంభింప బడినపుడు ప్రజలయొక్క ఆరోగ్యాన్ని, నైతిక ప్రవర్తనను బాగుచేయడానికి మద్య పాన నిషేధాన్ని అమలుపరుస్తున్నామని, ఆ విధంగా కలిగే లోటును భర్తీ చేయడానికి సేల్సుటాక్సును విధిస్తున్నామని ఆనాటి మద్రాసు రాష్ట్ర ముఖ్య మంత్రి శ్రీ రాజగోపాలాచారిగారు చెప్పివున్నారు. మద్యపాన నిషేధం వచ్చింది. ఐతే దానివల్ల లాభాలున్నాయా, లేవా అనే విషయం వేరు. దాని జయాపజయాల విషయంలో మా కెన్నో సందేహాలున్నాయి. దొంగసారాయి ఉత్పత్తి విశేషంగా జరుగుతుందనేది అందరికీ తెలిసిన విషయమే. ఇది జరిగితేగాని కొంతమంది ఉద్యోగస్థులకు గాని, కొంతమంది ధనవంతులకు గాని మరికొంతమంది ఇతరులకుగాని వృత్తులు పోతాయని ప్రభుత్వం భావించవచ్చు. ఏమైనప్పటికి అదనపు పన్నులభారాన్ని పేదప్రజానీకంపై రుద్దవద్దని మా కోరిక. మద్యపాన నిషేధమైనా రాష్ట్రమంతటిలో ఒకే విధంగా లేదు. తెలంగాణా ప్రాంతంలో యీ నిషేధంలేదు. ఐతే వెనుక ఎగుమతి, దిగుమతి సుంకాలు హైదరాబాదు రాష్ట్రంలో వుండేవనీ, వాటిస్థానే యిపుడు సేల్సుటాక్సు విధింపబడుతున్నదని చెప్పవచ్చు. రాష్ట్ర ఐక్యత దృష్ట్యా మద్యపాన నిషేధం విషయంలో ఒకలాభదాయకమైన విధానం ఉండడం మంచిది. అభివృద్ధి కార్యక్రమాలకు డబ్బు కావాలనే సాకుతో పేద ప్రజలమీద పన్నులు రుద్దడం జరుగుతున్నది. ఐతే, ఏ సూత్రాల ననుసరించి పన్నులు విధింపబడాలి అనే విషయాన్ని ప్రభుత్వం గమ నించాలి. సాధ్యమైనంత తక్కువమందిమీద తేలికగా వసూలయ్యే రీతిలో పన్నులు విధించడం ఉత్తమం. పన్నులు రిగ్రెసివ్‌గా ఉండకూడదు. యిచ్చుకోగలవారి పైననే పన్నులు విధించాలి. పేదప్రజల జీవన ప్రమా ణాలను గమనించి వారిపై పన్నులభారం తగ్గించాలి. వివిధవర్గాల జీవన స్థితిగతుల దామాషాను బట్టి పన్నులు విధించాలి. అయితే యీ సూత్రాలలో వేటినికూడా ప్రభుత్వం సేల్సుటాక్సు విధింపు విషయంలో అమలు జరుపుట లేదనేది నిస్సందేహం. పేదప్రజానీకంమీద పన్నులభారం పడుతున్నదని మంత్రులు అంగీకరించారు, వర్తకులు అంగీకరించారు, దేశమంతా అంగీక రించినది. మద్రాసు రాష్ట్రంలో సాలుకు 10 వేలరూ॥ల అమ్మకంగలవర్తకులదగ్గర నుంచి మాత్రమే ఈ పన్ను వసూలు చేస్తున్నారు. అంతకు తక్కువ వర్తకం చేసే వాళ్ళమీద ఈ పన్ను విధించరు. సంవత్సరానికి 10 వేల రూ॥ల అమ్మకం

అంటే నెలకు దాదాపు 8 వందల రూ॥ల వ్యాపారం మాత్రమే ఆ వర్తకునికి ఉన్నదన్నమాట. అంటేరోజుకు సుమారు 25,30 రూ॥లకు బేరం ఉంటుంది అని చూచుకున్నట్లయితే రోజుకు 2రూ॥లకు మించి అతనికి లాభం సంపాదించడం సాధ్యంకాదు. రోజుకు 2 రూ॥ లాభం సంపాదించుకునే వర్తకం ఎంత పెద్దదో మనం అర్థం చేసుకోవచ్చు. అటువంటి చిన్నవర్తకులను లెక్కలు కట్టమని ప్రభుత్వం వత్తిడి చేయడం, వారిని ఇబ్బందులపాలు చేయడమేనని మనవి చేస్తున్నాను. ఇట్టి చిన్న వ్యాపారస్థులపై ఉద్యోగస్తులు పెత్తనం చేయడానికి ఈ బిల్లుద్వారా సదుపాయం కల్గించడం మాత్రమే అవుతుందిగాని, దాని వలన వచ్చేలాభం అంతంత మాత్రంగానే ఉంటుంది. ఈ చిన్న వర్తకులను విసిగించి, అపహాస్యపుపాలుచేసి, ప్రజలు అసహ్యించుకొనే రీతిగా ఈ పన్నులు తయారు చేయవద్దని ప్రభుత్వంవారికి తెలియజేస్తున్నాను. ఆంధ్రరాష్ట్రంలో 10 వేల రూ॥లను ఒక లిమిట్‌గా పెట్టడం జరిగింది. కాని ఇప్పుడు దానిని 7,500 రూ॥లకు దించడం జరిగింది. ఏడాదికి 7,500 రూ॥లు టర్నోవరు వున్నవారు ఇకముందు పన్ను కట్టుకోవాలి. మొట్టమొదట సేల్సుటాక్సు విధింపబడినపుడు 10,000 రూ॥లు నికరం అమ్మకం వున్నపుడు దానిపై పన్ను విధించవచ్చునని చెప్పబడియున్నది. అంటే పన్ను చెల్లించవలసిన వస్తువులను మాత్రమే 10,000 రూ॥ల వరకు అమ్మితే, ఆ వర్తకుడు ప్రభుత్వానికి పన్ను చెల్లింపవలసి యుంటుంది. అటువంటి వర్తకులు మాత్రమే పన్ను చెల్లించవలెనని మ॥దాసు జనరల్ సేల్సుటాక్సు ఆక్టులో వున్నది. ఐతే, ఈ నిబంధన 1939 సం॥లో చేయబడింది. కాని 1956 సం॥లో ఈ చట్టానికి అప్పటి ఆంధ్ర ప్రభుత్వం ఒక సవరణ చేసింది. దానినిబట్టి గ్రాస్‌టర్నోవర్ 10,000రూ.లు వున్నట్లైతే అమ్మకపు పన్ను చెల్లించాలన్నారు. అంటే అమ్మకం పన్నునుంచి కొన్ని వస్తువులు మినహాయించ బడినప్పటికీ వాటి అమ్మకాన్ని కలుపుకొని సాలుసరి విక్రయం 10,000 రూ॥లు వున్నట్లయితే ఆ వర్తకుడు పన్ను విధింపు నిబంధనకు లోబడవలసి వస్తుంది. అమ్మకం పన్ను నుంచి మినహాయించిన వస్తువులు అమ్ముకున్న వర్తకుడు పన్ను చెల్లించాలనే వాదన సమంజసమైన వాదన కాదని ప్రభుత్వంవారిని కోరుతున్నాను. ఏ వస్తువు మీద పన్ను లేదని చెప్పారో ఆ వస్తువులను అమ్ముకొన్నప్పటికీ కూడా వాటి అమ్మకాన్ని లెక్కలోకి తీసికొని పన్ను విధించ దలచడం అన్యాయం. ఇక ముందు ఒక వర్తకుని మొత్తం అమ్మకం సాలుకు 7,500 రూ॥లు వున్నప్పటికి, అతడు అమ్మకం పన్ను చెల్లించవలసి వస్తుంది. ఇటువంటి చిన్న వర్తకులను కూడా ఈ చట్టం క్రిందకు తీసుకురావడానికి ప్రయత్నం జరుగుతున్నది. అంతేగాకుండా 7,500 రూ॥ల సాలుసరి అమ్మకం వుండనప్పటికికూడా

5000రు॥లకు అమ్మకంమించినట్లయితే ఈలోపువర్తకులందరూ రిజిస్టరు చేసుకోవాలనే నిబంధన యున్నది. మొట్టమొదట సేల్సుటాక్సు చట్టం ఆనాడు 10,000రూ॥ల వర్తకంచేసుకొనేవారికే వర్తింపచేయవలెనని శ్రీరాజగోపాలాచారి గారు ఉద్దేంచినప్పటికి, విపరీతంగా ఈనాడు ధరలు పెరిగినా సాలుసరి మొత్తం అమ్మకం పరిమితిని 7,500 రూ॥లకు తగ్గించడం జరుగుతున్నది. అంటే నానాటికి ఇంకా ఇంకా చిన్న వర్తకులను కూడా ఈ చట్టం నిబంధనలతో కట్టి వేయడం జరుగుతున్నదన్నమాట. ఈ పన్ను వసూలుకు ప్రభుత్వంవారు నిక్కచ్చిగా తమ పోలీసు యంత్రాన్ని, యితరపరిపాలనా యంత్రాంగాన్ని మరింత కఠినంగా ఉపయోగిస్తారు. ఇందుకే ప్రభుత్వం యీ బిల్లుద్వారా ఎక్కువ అధికారాలను తీసుకొంటున్నది. ఒక ఏడాదికి 5000 రు. లు వర్తకం చేస్తాడంటే అర్థమేమిటి? నెలకు దాదాపు 400 రూ. ల అమ్మకం వుంటున్నదన్న మాట. అంటే రోజుకు 12, 13 రు. ల. బేరంమాత్రమే అతని కుంటుంది. దీనివల్ల ఆ వర్తకునికి వచ్చేలాభం రోజుకు 12, 13 అణా లకు మించి వుండదు. ఇంతచిన్న రాబడిగల వర్తకుడైనప్పటికి 3 రు. లు. రిజిస్ట్రేషన్ ఫి కట్టుకోవాలంటే, ఆదాయం రాకపోయినప్పటికీ కూడా పన్ను కట్టుకోవాలన్న మాట.

తనది 7,500రూపాయలకంటె ఎక్కువ లేదని ఋజువు చేసుకొంటే దానికి మినహాయింపు ఉంటుంది. అది ఋజువు చేసుకోలేని పరిస్థితులు గనుక ఉన్నట్లయితే అప్పుడు ఏ వుద్యోగో, ఏ sales tax ఆఫీసరో వెళ్ళి "మీకు ఇంత అమ్మకం జరుగుతూందని", ఇష్టంవచ్చినట్లు పన్ను వసూలు చేయడం జరుగుతుంది. అసలు 1937 లో 10 వేల రూపాయలు net turnover వున్నట్లయితే, పన్నుఉండేది. ఈరోజు రూపాయవస్తే, ఆరోజు నాలుగు అణాలుచేరుతూ ఉండ్డేవది. నిజంగా turnovr అనేదే చూసుకున్నట్ల యితే,ఆరోజు 10 వేలు gross turnover ఉన్నవాళ్ళమీదపన్ను వేయడంన్యాయం అని అనుకొన్నట్లయితే,నేడు40,000 gross turnover ఉన్నవాళ్ళమీదఈపన్ను వేయాలి గాని, అంతకంటె తక్కువ ఉన్నవాళ్ళమీద వేయడం అనేది సూత్ర ప్రకారం తప్పుఅని తెలియచేయవలసి యుంటుంది. Gross turnover అన్నప్పుడు ఇంకొకపదివేలు అదనంగా పెట్టుకొని, దీనికి exemptionచేయాలి. ఈ రోజుఉన్న exemption ను బట్టి చూచినట్లైతే మొత్తం gross turnover గనుక రు॥లు 50, 000 ఉన్నట్లయితే, నిజంగా net turnover పదివేలు కన్నా ఎక్కువ ఉండదు. అంటే పన్ను కట్టుకోవలసిన వస్తువులు చూచినట్లైతే, సగానికిసగం కంటె ఎక్కువ ఉండదు. అటువంటప్పుడు, ఈ turnover limit, taxable limit పెంచవలసినదానికి బదులు తగ్గించడమంటే

మామూలుగా చిన్నచిన్నవర్తకులు కిల్లీ దుకాణదారులు మొదలైన వారివద్దకు ప్రభుత్వము తన ఉద్యోగి బృందాన్నంతా పంపించి బలవంతంగా పన్నులు వసూలు చేయడం తప్పితే ఇంకొకటి కాదని చాలా స్పష్టంగా తెలుసుకోవచ్చు.

మిస్టర్ స్పీకర్:- త్వరగా పూర్తిచేయండి.

శ్రీ పి. సుందరయ్య:- ఇది చాలా ముఖ్యమైనబిల్లు. తొమ్మిదికోట్ల రూపాయలకు సంబంధించినది. అందుచేత కనీసం 9 రోజులైనా పడుతుంది.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- ఇంతకుముందు 7-1/2 కోట్లు ఇచ్చారు. ఇప్పుడు 8, 8-1/2 కోట్లు ఇవ్వవచ్చు!

శ్రీ పి. సుందరయ్య:- ఇదివరకు పొరబాటుగా 7-1/2 కోట్లు ఇచ్చారు. ఇప్పుడు ఆ 7-1/2 కోట్లుకాదు, 9 కోట్లుకాదు అసలు ఆ సూత్రాల అన్నింటిని ఒక పర్యాయం విమర్శించుకొంటేగాని లాభంలేదు.

MR. SPEAKER:- Then, I shall use my own discretion. I can give only ten more minutes. We cannot continue the Bill for nine days.

శ్రీ పి. సుందరయ్య:- అధ్యక్షా, ఈబిల్లులో చాలముఖ్యమైన విషయాలుఉన్నాయి. ఆవిధంగా limit పెట్టి పదినిమిషాలుఅంటె ఏమిచెప్పడానికి వీలులేదు.

మిస్టర్ స్పీకర్:- మీకు ఏంతటైము కావాలి ?

శ్రీ పి. సుందరయ్య:- కనీసం 2, 3 గంటలైనా కావాలి.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- Clause by clause వచ్చినపుడు ఆయా విషయాల గురించి మాట్లాడవచ్చును, ఇప్పుడు general discussion లో అంత ఎక్కువగా మాట్లాడవలసిన అవసరంలేదేమో అనుకొంటాను.

శ్రీ పి. సుందరయ్య:- అసలు బిల్లులవిషయంలో అందులోను పన్నుల బిల్లుల విషయంలో time limit పెట్టే సాంప్రదాయము ఏశాసనసభలో కూడాలేదు.

మిస్టర్ స్పీకర్:- మంత్రులకు, లీడర్సుకు అరగంటఅని, ఇతరులకు పదినిమిషాలని ఇదివరకేదో time limit పెట్టారు. కాని, మీరు 5 గంటలుకావాలి, 6 గంటలు కావాలి అంటే నాకు అర్థం కావడంలేదు.

DR. B. GOPALA REDDI:- In the rules, there is no difference between taxation bills and other bills.

మిస్టర్ స్పీకర్ :- . మంత్రులకు, leaders కు అరగంటసేపు అని time limit పెట్టుకొన్నారు. పోనీ మీరు ఇంకొక అరగంటసేపు తీసుకోండి.

శ్రీ పి. సుందరయ్య:- మామూలుగా ఏబిల్లు వచ్చినప్పటికినీ, సభ్యులంతాకూడా సాకల్యంగా చర్చించడం జరుగుతుంది. మేము చెప్పిన పాయంట్లే చెప్పుతూ ఉంటే, మీరు time ఇవ్వకపోవడంలో అర్థం ఉన్నదిగాని, చెప్పిన point చెప్పకుండా మాట్లాడుతున్నపుడు కావలసిన time ఇవ్వకపోవడం సరిగాదు. పోనీ, ఈబిల్లుకు సంబంధించినటువంటి విషయాలు, వివాహాలను గురించిగాని విడాకులచట్టాలను గురించిగాని, బైగమీచట్టాల గురించిగాని, మాట్లాడుతూ ఉంటె, "irrelevant గా ఉన్నది, శాసనసభయొక్క కాలాన్ని దుర్వినియోగం చేస్తున్నారు" అని చెప్పవచ్చు. కాని, ఈబిల్లుకు సంబంధించిన సూత్రాలపై మాట్లాడుతున్న పుడు, "అరగంటలో పూర్తిచేయాలి, పదినిమిషాలలో పూర్తి చేయాలి" అన్నట్లైతే ఈచర్చవల్ల ఏమీ ప్రయోజనముండదు. ఇదివరకు పార్లమెంటులోగాని. ఏ శాసనసభలోగాని, బిల్లులకు సంబంధించిన సూత్రాలు గురించిగాని, అందులో provisions గురించిగాని, మాట్లాడినప్పుడు దానికి time limit పెట్టడంఅనేది నాకుతెలిసినంతవరకు ఎక్కడాలేదు.శ్రీగోపాలరెడ్డి గారు 1936 నుంచి శాసనసభలో ఉన్నారుగదా ! కనుక వారిని చెప్పమనండి. ఏ శాసనసభలలోగాని, ఏ బిల్లు సందర్భంలోనైనా ఈ రీతిగా time limit పెట్టడం జరిగిందేమో ఒక్క ఉదాహరణ చెప్పమనండి. ఆ విధంగా చెప్పినట్లయితే, అది సరియైనది కాకపోయినప్పటికి మీ సూచన అంగీకరించడానికి తయారుగా ఉన్నాను. కనుక, ఏ శాసనసభలోగాని ఇదివరకు లేనటువంటి సాంప్రదాయాన్ని తీసుకువచ్చి time limit పెట్టి ఏదో ఒక విధంగా ఈ బిల్లు rush చేసేదానికొరకు ఈ చర్చ సాగించడమే అవుతుంది.

ఇక ఈ రేట్ల విషయం వచ్చినప్పుడు, net turnover గా ఉన్నదాన్ని gross turnover గా చేయడం సరికాదు. ఇదివరకు పదివేలు ఉన్నదాన్ని పెంచవలసినదానికి బదులు ఏడువేలకు తీసుకురావడం అంటే, ఇది చిన్న చిన్న వర్తకులను harass చేసేదానికి, తొందరపెట్టేదానికి, ఇబ్బందులకు గురిచేసేదానికే తోడ్పడుతుంది. దీనివలన ఈ పన్నుల సిబ్బందికి మరొక అవకాశం కలుగజేసి మనప్రజలలో అసహ్యత, అయిష్టత పుట్టి ఈ పన్నులను తప్పించుకొనే మార్గాలను అవలంభించి,చట్టానికి వ్యతిరేకమైన కార్యక్రమానికి దిగడానికి మనమే ప్రోద్బలం చేసినవారమవుతాము. అనేకమంది వర్తకులు ఇచ్చినటువంటి మెమోరాండాలు చూచినట్లయితే, ఈ బిల్లు విషయంలోగాని, ఇదివరకు Sales Tax Enquiry Committee పై గాని, అసలు దేశం మొత్తంమీద ఈ సమస్య వచ్చినప్పుడు ఈ multiple point tax వల్ల, ప్రతి చిన్నవర్తకునికి నెత్తిమీదికివచ్చి, దీనివల్ల అనేకచిక్కులువస్తాయని తెలుస్తుంది. అందుచేత చిన్నచిన్న వర్తకులను మినహాయించవలసి యుంటుంది. దీనికి

అసలు wholesale dealers మీద, పెద్ద పెద్ద వర్తకుల మీద single point గా వసూలు చేస్తున్నారు. అది సరియైనదే. అందుచేత సాధ్యమైనంత తక్కువమంది దగ్గరనుంచి ఎక్కువ పన్ను వసూలుచేయడానికి పూనుకోవాలనే taxation principle ప్రకారం చూచినప్పటికి కూడాను, ఈ limit 10,000 నుంచి 7,500కు తగ్గించడం చాలా అన్యాయము. కనుక దీనిని ఇంకా ఎక్కువ, అంటే కనీసం 20 వేలో, 25 వేలో చేసేదానికి ప్రభుత్వము పూనుకోవలసి యుంటుందని మా యొక్క demand. అంతే కాదు, ఇదివరకు అన్నివస్తువుల మీద multiple point tax ఉన్నప్పుడు పదివేలు gross turnover పెట్ట డానికి బదులు, net turnover పెట్టడం జరిగింది. ఈ రోజు schedules 2, 3 లో ఎక్కువగా ప్రజలు ఉపయోగించేటటువంటి వస్తువులన్నింటిమీద single point sales tax క్రింద, purchase tax క్రింద మార్చడం జరిగింది. వాటిని ఎప్పుడైతే single point tax క్రింద మార్చడం జరిగిందో, అప్పుడు అనేక వస్తువులు multi-point tax క్రింద రావడానికి మినహాయింపు ఇవ్వక తప్పదు. ఎప్పుడైతే ఇన్ని వస్తువులకు మినహాయింపు ఇవ్వవలసివస్తుందో, వాటన్నింటికి wholesale dealers దగ్గరనుంచి single point tax collect చేసిన తరువాత retail dealers అందరు కట్టుకోవలసిన అవసరము లేదు, అని ఎప్పుడైతే చట్టము చేస్తామో, అప్పుడు gross turnover 50,000 ఉంటే నిజంగా net turnover 25,000 కంటె ఎక్కువ ఉండదు. ఇంకా తక్కువే ఉంటుంది. ఆ రీతిగా కాకుండా, ఈ బిల్లులో చెప్పిన ప్రకారం 7,500 gross turnover అన్నప్పుడు, అసలు గుడ్డ అమ్ముకోవలసియుంటుంది. Schedules 2, 3 లో దాదాపు 42 వస్తువులు కూడా single point level లో ఉన్నాయి. ఈ 42 వస్తువులు ఇదివరకే single point క్రింద వచ్చాయి. వాటన్నింటిని మినహాయించేందుకు వాటిని మేము అమ్మాము అని వాటికి లెక్కలు తయారు చేసుకొని వాటిని మినహాయించిన తరువాత మిగిలిన వస్తువులమీద మాకు net turnover ఇంత అని దానిమీద పన్నులు వేయాలని చెప్పడంకోసం లెక్కలు పెట్టుకోవలసియుంటుంది. ఈ లెక్కలు పెట్టుకోకపోయినట్లైతే ఎంత ప్రమాదం జరుగుతుందో ఆలోచించండి. అంటె 75,000 రూపాయల వరకు అమ్మితే దాంట్లో 3,700 రూపాయలదాకా, దాదాపు 4,000 దాకా, exemption రావాలి. ఈ sales tax ప్రకారం exemption రావాలంటె, లెక్కలన్నీ వ్రాయాలి. ఈ 42 వస్తువులను ఇంతకు అమ్మినాను, మిగిలిన వస్తువులను ఇంతకు అమ్మినాను, అందుచేత 7,500 gross turnour అయినా, నేను పన్ను ఇచ్చుకోవలసింది 3,000 మీదనే అని లెక్కలు తయారు చేసుకోవాలంటె, అది చిన్న చిన్న దుకాణదారులకు ఎంత కష్టమో ఆలోచించండి. దాని

అర్థమేమిటంటే, ఈ exemption లేకపోయినా పరవాలేదు. ఈ లెక్కలన్నీ వ్రాసుకొనే బదులు, exemption లేకుండా పన్ను చెల్లించుకోవడమే తేలిక అనుకొని వారికి న్యాయంగా రావలసిన exemption కూడా demand చేసుకోలేక పన్ను కట్టుకోవలసిన దుస్థితికి చిన్న చిన్న వర్తకులు రావడం జరుగుతుంది. ఇంకొక విషయంకూడా ఆలోచించమని కోరుతున్నాను. ఇందులో రు. 7,500 వరకు వర్తకం లిమిట్ తగ్గించారు. అనగా రోజుకు 15 రూపాయలు వరకు వర్తకం చేసేవారన్న మాట. 15 రూపాయల వర్తకం అంటే ఒకవస్తువు మీదే వర్తకం చేస్తారా? చిన్న చిన్న వ్యాపారస్థులు బియ్యం, ఉప్పు, పప్పు, చింతపండు, కారం అనేక పచారీ దినుసులు, అనేక రకాల చిల్లర వస్తువులు తెచ్చి అమ్ముతారు. ఆ చిల్లర వస్తువులన్నింటికి ఏ రకంగా లెక్కలుపెట్టి, రసీదులు వ్రాసి అమ్మగలడు? అయితే ప్రజలనుంచి వసూలు చేస్తున్నప్పుడు చిన్న వ్యాపారస్థుడైనప్పటికి పన్ను కట్టుటకు నష్టము ఏమిటని ప్రభుత్వ వాదన. ఆఫీసులోకూర్చొని వర్తకం అంటే ఏమిటో తెలియకుండా, చిల్లర వ్యాపారమంటే ఏమిటో తెలియకుండాచెప్పేవారి కబుర్లు అవి. వారికి డబ్బు బాగా వస్తుంది కాబట్టి చిల్లర దుకాణానికి వెళ్ళి కొనిన పాపాన పోలేదు. హోల్ సేల్ దుకాణానికివెళ్ళినెలకో, సంవత్సరమునకో కావలసినధాన్యం.పప్పులు కొనుక్కుంటారు. అటువంటి వారికి చిల్లర వ్యాపారం సంగతి తెలియదు.

MR. SPEAKER: The time is over.

SRI P. SUNDARAYYA: I want some more time Sir.

MR. SPEAKER: The Speaker has every right or discretion to allot time to the members. I cannot give up my right. I cannot surrender that right or discretion to allot time to any member of the House, however important he may be—be he a Minister or the Leader of the House. Therefore, we must now settle the time-limit; otherwise, the business of the House cannot be completed within the scheduled time

అందువల్ల నా కున్న అధికారం సొంతం వదులుకోమంటేను, సభ్యులు ఇష్టం వచ్చినంతసేపు మాట్లాడుతామంటేను, నేను ఒప్పుకొనను. మినిష్టర్లు కానివ్వండి, పార్టీ లీడర్సు కానివ్వండి, 30 నిమిషాలో, 40 నిమిషాలో, ఒక గంటో మాట్లాడ వచ్చునుగాని, 5 రోజులు మాట్లాడాలి, మా యిష్టం, అంటే నేను ఒప్పుకోను. తమ యిష్టముకాదు. ఇక్కడ నా యిష్టం, నన్ను అడగండి. తమకు ఎంత టైము కావలెనో, దానికి ఒప్పుకొనేది, లేనిది, నేను చెబుతాను.

శ్రీ పి. సుందరయ్య :- నా యిష్టమని నేను చెప్పుటలేదు. నా యిష్టం అని అంటే అసలు యిక్కడకు రానవసరంలేదు. శాసన సభ్యులకు కొన్ని సాంప్రదాయాలున్నాయి.

మిస్టర్ స్పీకర్:- రెండు గంటలు కావాలి, నాలుగు గంటలు కావాలి అనే సాంప్రదాయాలు నేను ఎరుగను.

శ్రీ పి. సుందరయ్య:- దురదృష్టం అక్కడే వస్తోంది.

మిస్టర్ స్పీకర్:- రాజ్యసభగాని, లోకసభగాని నేను ఎరుగను. నేను 29, 30 ఏండ్ల నుంచి ఈ సభ ఎరుగుదును.

శ్రీ పి. సుందరయ్య:- నేను అధ్యక్షులను కోరేది అదే. 30 ఏండ్ల లోపల ఏ బిల్లుమీదనైనా జనరల్ డిస్కషన్ జరిగేటప్పుడు, ముందు చెప్పకుండా, ఇంత కన్నా ఎక్కువసేపు మాట్లాడకూడదని, ఏ అధ్యక్షుడైనా, ఎప్పుడైనా, మీ అనుభవంలో రూలింగ్ యిచ్చివుంటే ఉదాహరణ చెప్పమని మిమ్ములను, గోపాలరెడ్డిగారిని కూడ అడుగుతున్నాను. నాకు యిప్పుడు ఏ రూల్సు అవసరం లేదు కూడా. నాకు రెండు గంటలు యిప్పుడు కావాలి. అది ఇస్తారా? ఎంత యిస్తారో చెప్పండి.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- నాకు రెండు గంటలు కావాలి, ఎంత యిస్తారో చెప్పండి అని బేరమా ?

శ్రీ పి. సుందరయ్య:- అధ్యక్షులు చెప్పమంటున్నారు కాబట్టి చెప్పాను. లేక 'నా యిష్టం' అని చెప్పనా ?

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- నా ఉద్దేశం ఈ రోజున జనరల్ డిస్కషన్ పూర్తి అయిపోతే రేపు, ఎల్లుండి క్లాజు బై క్లాజు చేసుకుంటే సరిపోతుంది. ఇదివరకు ఒక జనరల్ డిస్కషన్ జరిగింది. తరువాత సెలక్టు కమిటీలో డిస్కషన్ జరిగింది. ఇది రెండవ జనరల్ డిస్కషన్. అందువల్ల ఈ దినంతో ముగించి, 12, 12-30 గం. లకు జవాబు చెప్పుటకునన్ను పిలిస్తే బాగుంటుంది. తరువాత ఏ క్లాజుకు సంబంధించి ఆ క్లాజుకు వివరంగా చెప్పుకొనుటకు వీలుంటుంది. లేకపోతే జనరల్ డిస్కషన్‌కు జవాబు చెప్పుట కష్టమై పోతుంది. వారు 116 పాయింట్సు రైజ్ చేస్తారు. వాటన్నింటికి జవాబు చెప్పుట కష్టం నా కిచ్చే 45 నిమిషాలలో.

శ్రీ పి. సుందరయ్య:- అయితే బిల్లు మూడు రోజులలో పాస్ చేయాలని ఎక్కడైనా ఉన్నదా ?

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- క్లాజు బై క్లాజు తీసుకొన్నప్పుడు వివరంగా మాట్లాడు కొనవచ్చును. ఇప్పుడు జనరల్ డిస్కషన్‌లో కష్టము.

శ్రీ పి. సుందరయ్య:- జనరల్ డిస్కషన్ లిమిట్ చేసి. క్లాజ్ బై క్లాజు రీడింగులో పాయింటుకు, అమెండ్‌మెంటుకు కన్‌ఫైన్ అయి మాట్లాడేటప్పుడు అవ కాశం తక్కువగా వుంటుంది. ఆ సందర్భంలో కొత్త పాయింటు తీసుకు రావడం అసంభవం. ఇప్పుడు జనరల్ డిస్కషన్‌లో వీలుంటుంది. సూత్రాల మీద, సిద్ధాంతాలమీద యిప్పుడు మాట్లాడ వచ్చును. దానికి అవకాశం యివ్వ కుండా, ప్రభుత్వ పక్షమునకు మెజారిటీ ఉన్నదిగదా అని పాస్ చేయాలను కుంటే అది వేరే సంగతి.

మిస్టర్ స్పీకర్:- సుందరయ్యగారూ ! 25 నిమిషాల్లో ముగించండి.

శ్రీ పి. సుందరయ్య:- 25 నిమిషాలలో కాదు. కనీసం ఒకటిన్నర గంటలైనా కావాలి. లేకపోతే విషయాలన్నీ చెప్పుటకు సాధ్యం కాదు. మన ఆదాయం 40 కోట్లు. ఇది 10 కోట్ల రూపాయల ఆదాయం తెచ్చే బిల్లు. ఇప్పుడు 365 రోజులకు సంబంధించిన బిల్లు తెచ్చి— దీనివల్ల యింక 95 లక్షల ఆదాయం వస్తుంది— దీనిని మూడు రోజులలో, మూడు నిమిషాలలో పాస్ చేయమని అడగడం న్యాయం కాదు. నేను తొమ్మిదిన్నరకు మొదలుపెట్టాను.

మిస్టర్ స్పీకర్:- ఇంకొక అరగంట తీసుకోండి.

శ్రీ పి. సుందరయ్య:- అరగంటలో చెప్పడం సాధ్యంగాదు. ఇంకా పీఠికలోనే ఉన్నాను. ఇంకా 1వ అంకం, 2వ అంకం, 3వ అంకం, 5వ అంకందాకా రావలసి ఉన్నది. మొట్టమొదటనే అరగంటకు మించి ఎక్కువ ఉపన్యాసము యిచ్చుటకు వీలులేదని అంటే, దానిని గురించి ఏమి చేయాలనేది అప్పుడు ఆలోచించుకొనెడివారము.

మిస్టర్ స్పీకర్:- ఇవ్వాళ ఒక గంట యిస్తాను. రేపటినుంచి అరగంట కంటె ఎక్కువ మాట్లాడకూడదని ముందుగానే చెబుతాను.

శ్రీ బి. రత్నసభాపతి (బద్వేల్):- జనరల్ డిస్కషన్ ఇవ్వాళ పూర్తికావడానికి అవకాశం లేదు.

మిస్టర్ స్పీకర్:- వీలున్నంతవరకు చూస్తాము. సుందరయ్యగారు యింకొక గంటలో కానివ్వాలి. ముందుగా చెప్పలేదు కాబట్టి స్పెషల్ కేసుగా యిస్తు న్నాను. ఇది అయిన తరువాతనుంచి టైమ్ రెగ్యులేట్ చేస్తాను.

శ్రీ పి. సుందరయ్య:- ఏమైనాసరే, యీ సమస్యనుగురించి యింకా చూడవలసి వుంటుంది. బిల్సుమీద డిస్కషన్ గురించి రూల్సు సక్రమంగా లేకపోతే చేంబర్‌లోనో, రూల్సు కమిటీలోనో ఈవిషయం ఆలోచించాలి. మేముకూడ ఫిలిబస్టర్ చేయాలనికాదు. అసంభవంగా యింతబిల్లుతెచ్చి మూడురోజులలో ఎట్లా పాస్‌చేస్తారు ? దీనికి సంబంధించిన పాయింట్సు అన్నీ మాట్లాడడానికి మాకుకూడా టైంకావాలి.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- 40 క్లాజులబిల్లు మూడుదినాలలో పాస్ చేయలేకపోతే ఎట్లా?

శ్రీ పి. సుందరయ్య:- 365 రోజులలో 3 వేలమంది సిబ్బందిని పెట్టుకున్నా చేయలేరుగాని, శాసనసభ్యులు 3 రోజుల్లో, 3 నిమిషాలలో పాస్ చేయమంటే ఎట్లా సాధ్యమవుతుంది ? అది తరంకాదని మేము చెబుతున్నాము.

అధ్యక్షు:- చిల్లరవర్తకం ఏరీతిగా జరుగుతుందో తెలియనివారు ఈ మాటలు చెప్పవలసినదేతప్ప తెలిసినవారు చెప్పరు. రోజుకు 15 రూపాయల వ్యాపారం చేసేవారు అనేకరకాలైన వస్తువులు అమ్మవలసివచ్చినపుడు అణాకు, రెండణాలకు, నాలుగణాలకు అమ్మే చిల్లరవస్తువులకు ఏవిధంగా లెక్కవ్రాసి, పన్నువేసి బిల్లుయిస్తారు? అందులో కొన్ని మినహాయింపు వస్తువులు, కొన్ని మినహాయింపు లేనివి ఉంటాయి. వీటన్నిటికి లెక్కలు వ్రాయటం సాధ్యంకాదు. ప్రభుత్వ డిపార్టుమెంటులలో అనుభవముఉన్న ఎవరినైనా అక్కౌంటెంటును తీసుకువస్తే వారిని నేను ఒక చిల్లరదుకాణందగ్గర కూర్చోబెడతాను, అక్కడ రోజుకు 15 రూపాయలుఅమ్మే అమ్మకములకు, ఏవస్తువు ఎంతెంత అమ్మాడో, దేనికి ఎంతపన్నో బిల్లులు వ్రాసియివ్వగలరా ? అది అసంభవము. అణాకు, రెండణాలకు సేల్సుటాక్సు ప్రజలనుంచి వసూలుచేయగలడా? సామాన్యంగా చిల్లరవ్యాపారస్థులు యింత అమ్మినామని మొత్తంగా చూచుకొని, లాభాలు, నష్టాలు పోను, పన్ను కట్టవలసినదేగాని, ప్రతి చిన్నవస్తువుకు అణాకు, రెండణాలకు ప్రజలనుంచి వసూలుచేయటం అసంభవమైన విషయం. ధరలు ఎక్కువ వేసుకోవచ్చు, తక్కువ వేసుకోవచ్చు, కాని చిన్న అమ్మకములమీద ప్రజలనుంచి సేల్సుటాక్సు వసూలుచేయుటఅసంభవం. మొత్తం అమ్మకంమీద లాభనష్టాలుపోను పన్ను కట్టాలిగాని. ప్రజలనుంచి వసూలుచేయటం అసంభవం. కాబట్టి ఈలిమిట్ 7,500 కు తీసుకురావటం అంటే గాయంలో కారంపెట్టటం తప్పితే యింకేమీకాదు. ఇంకొకపొరపాటు ఏమంటే నెట్ టర్‌నోవర్‌ను, గ్రాస్‌టర్‌నోవర్ చేయటం, గ్రాస్‌టర్

నోవర్‌ను ఎక్కువ చేయాల్సినదిపోయి, దానిని తగ్గించుట చాలాప్రమాదకరం. దీనిని మేము పూర్తిగా వ్యతిరేకిస్తున్నాము. తరువాత రిజిస్ట్రేషను ఉన్నది. రు. 7,500 నుంచి యిప్పుడు 5 వేలు చేశారు. సెలెక్టు కమిటీలో యిచ్చిన లెక్కలప్రకారం 10 వేలనుంచి 7,500 అమ్మకంలిమిట్ తగ్గిస్తే కొత్తగా 7 వేల మంది అదనంగా పన్ను కట్టవలసివస్తుందని చెప్పారు.

ఏడువేలమంది అదనపుపన్ను కట్టవలసివస్తుందా ?, లేక ఇంకా ఎక్కువమంది కట్టవలసిఉంటుందా ?, దీనికి సరైన అంచనాలు ఉన్నాయా అనేది అనుమానంగా ఉన్నది. ఏడువేలని అంగీకరించినా, ఇంత తొందరగా అదనంగా పన్నువేసి మీరు లాభపడబోయేది ఎంత ? అందులో నెట్ టరన్ ఓవర్ ప్రకారం నూటికి 50 వరకు అయినప్పుడు మూడువేల ఐదువందల రూపాయలు పన్ను కట్టుకోవలసియున్నది. సంవత్సరానికి మనిషిదగ్గరనుంచి 5,500 కన్నా ఎక్కువ వసూలు చేయటానికి సాధ్యమా ? 7,500 కు చూసుకొన్నప్పటికీ కూడ, పది లక్షలు, పదిహేను లక్షలు కన్నా హెచ్చు వసూలు అయ్యేది కాదు. ఈ పదిహేను లక్షల డబ్బుకోసం ఏడువేలమంది చిన్న వర్తకులను పీడించటం అనేది న్యాయమా అని అడుగుతున్నాను. ప్రభుత్వం పన్ను వేసే పద్ధతి తప్పు. ప్రభుత్వం వ్యవహరించే పద్ధతే తప్పు. ప్రజల మీద ఎంత కావాలంటే అంత అపరాధాలు వేసేదానికి ఉద్యోగ బృందానికి పెత్తనం ఇవ్వటానికే ఇది ఉపయోగపడుతుంది తప్ప, ప్రభుత్వానికి ఒక దమ్మిడీ ఎక్కువ వచ్చేదానికి ఇది ఏమీ ఉపయోగపడదు. ప్రజలకు, ప్రజాప్రతినిధులకు మరింత ద్వేషం, మరింత అసహ్యత కలిగించటానికి మాత్రమే యీబిల్లు ఉపయోగపడుతుంది తప్ప, ఇంకొకటికాదు.పోతే యీరేట్ల గురించి ఇదివరకే కొంత వివరించటం జరిగింది. ప్రజలు నిత్యమూ ఉపయోగించేటటువంటి వస్తువుల మీద పన్ను వేయవద్దని చెప్పాము. తెలంగాణాలో మనం చూచినపుడు, బెల్లం మీద పన్ను లేదు. వంటచెఱకు మీద పన్నులేదు. కట్టెలమీద పన్నులేదు. వ్యవసాయదారులకు కావలసిన ఎరువులమీద పన్ను లేదు. ఉల్లిపాయలు, బంగాళాదుంపలు మీద పన్నులేదు. వీటన్నింటిమీద, ఇవాళ అదనంగా పన్ను వేసి ఎంత సంపాదిస్తారు ? వీటన్నింటికి కలిపి ఎంత ఆదాయం వస్తుందని సెలక్ట్ కమిటీలో అడిగితే, యీ ఉల్లిపాయలమీద, యీ బంగాళాదుంపలమీద ఒక లక్ష రూపాయలు మించి రాదని చెప్పారు.

ఈ లక్ష రూపాయలకోసం చిన్నచిన్న వర్తకులమీదకు సైన్యాన్ని పంపించి—సైన్యమంటేపన్నులు వసూలుచేసే సైన్యం అనుకోండి—ఏ విధంగా ఆదాయాన్ని పెంచి ప్రజలకు ఉపయోగపడే పనులు చేయబోతారో మాకు అర్థంకాదు సేల్సుటాక్సు ఎంక్వయిరీ కమిషన్ ఏమి చెప్పింది ? "ప్రజలు

నిత్యము ఉపయోగించే వస్తువులమీద పన్నులు వేయవద్దు; ఉన్న పన్నులను తగ్గించండి. కనీసం ఉన్నపన్నులైనా ఎక్కువ చేయవద్దు" అని కమీషన్ వారు చెబితే, "మాకు ఆదాయం కావాలి" అని ప్రభుత్వంవారు చెబుతున్నారు. "బియ్యంమీద, గోధుమల మీద సింగిల్‌పాయింట్ టాక్సు తెచ్చాము; దానిని గురించి ఆలోచిస్తాము" అని చెబుతున్నారు. "మెట్ట ప్రాంతములో ఉండే టటువంటి ప్రజలు- పేదప్రజలు- ఉపయోగించే జొన్నలు, సజ్జలు, కొఱ్ఱలు, రాగులమీద పన్నువేయకండి" అని అందరూ ఏకగ్రీవంగా చెబుతున్నారు. ప్రభుత్వఉద్యోగస్థులు, సేల్సుటాక్సు కమిటీలో ఉన్న కాంగ్రెసువారు, వర్తక ప్రముఖులు అందరు కూడ ఏకగ్రీవంగా "యీ జొన్నలు, సజ్జలు కొఱ్ఱలు, యీ ధాన్యములమీద పన్నువేయవద్దు వీటిని సేల్సుటాక్సునుంచి మినహాయించండి" అని చెప్పారు. దీనినిగురించి కాంగ్రెసువారు, మాజీమంత్రులు, అందరూ కూడ చెప్పారు. మెట్టప్రాంతాల్లో, కరువు ప్రాంతాల్లో ఉండే ప్రజలు తినేటటువంటి జొన్నలను మినహాయించమంటే మినహాయించటానికి వీల్లేదంటోంది ప్రభుత్వము. ఆఖరుకు సెలక్ట్‌కమిటీలో రెండు గంటలు చర్చించిన తరువాత మంత్రిగారు మహాదయతో "పోనీలే; ఇంతగా అడుగుతున్నారు; కాబట్టి ఒక నయాపైస సింగిల్‌పాయింటు ప్రకారం వేస్తాము" అన్నారు. ఇది జరిగినసంగతి. ఇది వారు ఇచ్చినటువంటి బ్రహ్మాండమైన 'సౌకర్యము.' దీనివల్ల పన్నులు రావు, ఆదాయమూ పెరుగదు. తిట్లు వచ్చేటట్లుగా పన్నులు పెట్టుకోవటం జరుగుతుంది.

ఉల్లిపాయలమీద, కూరగాయలమీద పన్ను వేయకూడదని అన్నాము. కూరగాయలు ఏ పూటవి ఆ పూటకే ఉంటాయి, ఆ తర్వాత చెడిపోతాయి. పెరిషబుల్‌గూడ్సు కాబట్టి వేయకూడదని అన్నాము. ఉల్లిపాయలు శాశ్వతంగా ఉంటాయా? అవి చెడకుండా ఒక సంవత్సరం ఉంటాయా? ఉల్లిపాయలను ఎంతో జాగ్రత్తగా ఉంచి, ఎండబెట్టినట్లయితే ఒక నెల రెండు నెలలు ఉండటము జరుగుతుంది. ఈరోజు తూచినదానికన్నా, ఒక పదిహేను రోజుల తర్వాత చూస్తే తూకం ఇంకా తగ్గుతుంది. అదికూడా పెరిషబుల్ ఫుడ్ కాబట్టి దానినికూడ కూరగాయలక్రింద తీసుకొని పన్నులేకుండా చేయాలని చెబుతున్నాము. ప్రజల అత్యంత అవసరమైన వస్తువులపైన పన్ను మినహాయించాలి. సెలెక్టు కమిటీలో యీ సమస్య వచ్చినప్పుడు, ప్రభుత్వమువారు అన్నారు: "ఉల్లిపాయలమీద తీసేస్తే చింతపండుమీద తీసెయ్యమంటారు; కారంమీద తీసెయ్యమంటారు" అని. నిజమే. చింతపండు, మిరపకాయలు, కారం, ఉల్లిపాయలు వీటిని సేల్స్‌టాక్సునుంచి మినహాయించాలి. ప్రజలు ఏదో కారం మెతుకులు తింటూంటే, ఆ కారం మెతుకులమీదకూడా పన్ను

వేస్తే ఎట్లా? కడుపునిండా మీరు పంచభక్ష్య పరమాన్నాలే పెడితే, అప్పుడు పాయసంమీద, యీ రిఫ్రెజిరేటర్సుమీద, రేడియోలమీద. విలాస వస్తువుల మీద పన్ను మానేసి, ఆ రోజు మిరపకాయలు, ఉప్పు, కారంమీద పన్ను వేసుకోవచ్చును. ఈ పంచభక్ష్య పరమాన్నాలను ప్రజలకివ్వకపోగా, మీరు "తినే కారంమెతుకులమీద పన్ను వేస్తాను; జొన్నలమీద పన్ను వేస్తాను; రాగులమీద పన్ను వేస్తాను" అని అంటే అది ఏ విధంగానూ సమర్థనీయం కాదని చెబుతున్నాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :- ౧౯౩౯ నుంచి మిల్లెట్స్‌పైన ఉన్నాయి. ఈ నాడు అవి కొత్తగా ఆకాశంనుంచిదిగి వచ్చినవి కాదు.

శ్రీ పి. సుందరయ్య :- గోపాలరెడ్డిగారు ౧౯౩౯ నుంచి వచ్చింది అన్నారు. ౧౯౩౯ నుంచి వచ్చినదానితో ఆగుతారా? దానిలో ఉన్న చెడును తీసుకొంటున్నారు. తెలంగాణాలో ఉన్న చెడును తీసుకొంటున్నారు. వీటన్నింటిని కలిపి, ప్రజలమీద యీ నాడు అదనంగా పన్నులు వేయడానికి ప్రయత్నం చేస్తున్నారు. ౧౯౩౯ నుంచి మిల్లట్స్‌మీద ఉంది. నిజమే. అప్పటి ప్రకారమే చెస్తారా? ఆ విధంగాచూస్తే, అసలు తెలంగాణాలో సేల్సుటాక్సులేదు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- అసలు అప్పుడు తెలంగాణా లేదు.

శ్రీ పి. సుందరయ్య:- తెలంగాణా అప్పుడూ ఉన్నది. ఇప్పుడు అది ఆంధ్ర ప్రదేశ్‌లో ఉంటే, అప్పుడు అది మరోప్రాంతంక్రింద ఉన్నది. పురాతన కాలంనుంచీకూడ తెలంగాణా ఉన్నది. మనకోస్తాప్రాంతం నదుల అవతల ఉన్నది.

(*Mr. Deputy Speaker in the Chair*)

ఈ తెలంగాణా ప్రాంతం, యీ దక్కన్ పీఠభూమి జియోలాజికల్‌గా, కోస్తాప్రాంతం రాకముందునుంచీ, అతిప్రాచీనమైన భూభాగంగా ఉన్నది. ఈ దక్కన్ పీఠభూమి. యీ తెలంగాణా భూభాగము హిమాలయాలకన్నా ప్రాచీన భూభాగము. తెలంగాణాభూమి లేకపోలేదు. పోతే అది ఎవరిక్రింద ఉన్నదనేదే సమస్య తప్పితే మరియొకటికాదు. కోస్తాప్రాంతంలో పుట్టినమనం కొత్తగావస్తే వచ్చిఉండవచ్చు కాని తెలంగాణా చాలా పాతకాలంనుంచీ ఉన్నది.

తరువాత. గుడ్డలమీదపన్ను వేయటం జరిగింది. సన్నని గుడ్డలు, అతిసన్నని గుడ్డలు యీ చీనిచీనాంబరాలమీద పన్ను వేసుకొంటామంటే ఎవరికీఅభ్యంతరంలేదు. కాని మీడియమ్‌క్లాత్, కోర్సు క్లాత్‌మీద పన్నులు ఎక్కువవేయడం న్యాయంకాదు. ఈబట్టలపైన పన్ను తగ్గించండని చెబుతున్నాను. నాలుగు

నయాపైసలు మీడియమ్‌క్లాత్‌మీద, రెండు నయాపైసలు కోర్సుక్లాత్‌మీద పన్నువేయటం సరైందికాదు. వీటిమీద ఎక్కువ పన్నువేయడం న్యాయం కాదు. ప్రభుత్వంచెప్పే వాదనంతా ఏమిటంటే, "జులై ఒకటవతేదీనుంచి కేంద్రప్రభుత్వం వీటన్నింటిని ఎక్సైజుక్రింద తీసుకొంటుంది; ఎక్సైజు క్రింద సర్‌ఛార్జి చేస్తుంది; ఆ సర్‌ఛార్జీలో మనకు భాగంవస్తుంది" అని. ఈ విషయంలో కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వానికి వాగ్దానం చేసినమాట ఒకటే ఒకటిఉన్నది. 'మీరంతవరకు ఎంతవసూలు చేస్తున్నారో అంతకుతగ్గకుండ మేము మీకుఇస్తామని' ఒక్కటేఒక్కమాట అన్నారు. "మీరుయింతవరకు పది రూపాయలు వసూలుచేస్తే, ఆపదిరూపాయలుఇస్తాము, ఇంకా ఒకరూపాయో, రెండురూపాయలో ఎక్కువేఇస్తాము" అని కేంద్రప్రభుత్వమువారు అన్నారు. "ఇప్పుడు మనం ఎక్కువపన్నులు వేసుకొని, ఎక్కువడబ్బు వసూలు చేసుకొన్నామని మనం కేంద్ర ప్రభుత్వానికి చూపితే, కేంద్ర ప్రభుత్వం అంత డబ్బు మనకు ఇస్తుంది. కాబట్టి పన్నులు తగ్గించటానికి వీలులేదు. ఇంకా హెచ్చుచేసుకొంటే మంచిది" అని ప్రభుత్వమువారు చెబుతున్నారు. ఈ బిల్లును మే నెల ౭వ తేదీలోగా పూర్తిచేస్తాము. నెలాఖరులోగా చట్టమవుతుంది. పోతే జూన్ నెలాఖరులోపల, ఒక్క నెలలో ఎంత పన్ను వసూలు చేయగలరు? అది ఏ విధంగా సాధ్యమవుతుంది? ఇంత వసూలు చేశాము, ఇంత డబ్బు మాకు ఇవ్వాలని కేంద్ర ప్రభుత్వాన్ని ఎట్లా అడగగలరు? కేవలం ఇది వాదించటం కొరకు మాత్రమే ఉపయోగిస్తుంది. కళ్లనీళ్లు తుడవటానికే యీ వాదన పనికివస్తుంది. "ఎక్కువ వసూలు చేస్తాము, ఎక్కువ ఇవ్వమని కేంద్రప్రభుత్వాన్ని అడుగుతాము" అని అనటము కుంటి వాదనగా కనిపిస్తుంది గాని వేరు కాదు. 'ఇంత ఆదాయం వస్తోంది, ఎక్కువ డబ్బు రాబట్టుకోగలం' అని మన ప్రభుత్వం ఆశించటం చాలా ఆశ్చర్యంగాఉన్నది. "మాకు ఎక్కువ ఆదాయం వచ్చింది, మీరు అంత డబ్బు మాకు ఇవ్వాలి" అనే వాదనతో కేంద్ర ప్రభుత్వమునుంచి ఎక్కువ డబ్బు రాబట్టడానికి చూడటం ఎంతో ఆశ్చర్యంగా ఉన్నది.

అయితే కేంద్ర ప్రభుత్వముతో "మా రాష్ట్రములో ఇంత జనాభా వున్నది. మా రాష్ట్రము ఆర్థికంగాను, విద్యా విషయకంగాను, రాష్ట్రముయొక్క జనాభానుబట్టి మా డిమాండు ఈ విధముగా ఉంటుంది" అని చెప్పవలసింది. అట్లా చేయకుండా మేము ఇంత ఎక్కువ పన్ను వేసుకుంటాము. అంతకు తక్కువకాకుండా మాకు ఇవ్వండి అని అడగడము సరియైన పద్ధతికాదు. అయినను జూలై నెలనుంచి కేంద్ర ప్రభుత్వముయొక్క బిల్లు అమలులోనికి రాబోతున్నది. ఇంక ఒక్క నెలమాత్రమే వ్యవధి యున్నదే. ఈ నెలరోజుల

లోపలనే ఇంత తొందరగానే మన పన్నుల హెచ్చింపుతో కేంద్ర ప్రభుత్వము ఇవ్వబోయే వాటాకు పోటీబెట్టి. కేంద్ర ప్రభుత్వాన్నుంచి ఎక్కువ డబ్బు సంపాదించాలని ఉద్దేశించి. ప్రజలమీద పన్ను హెచ్చు చేయడమనేది అర్థరహితము. దీనికి ఎవ్వరూ సమ్మతించరు. కాని నాకు కలిగే అనుమానము యేమిటంటే-మన రాష్ట్రములో medium గుడ్డమీద, coarse cloth మీద ఎక్కువ పన్నువేస్తే, ఇక కేంద్ర ప్రభుత్వానికి మనము చెప్పగలిగినది ఏమివుంటుంది? చీనిచీనాంబరములు, సన్నని, అతిసన్నని గుడ్డ, దుకూలాలు మనము విదేశాలకు ఎగుమతి చేసుకోవలసివస్తున్నది. అవి మన దేశములో తయారు చేయాలంటే, విదేశ యంత్రాలు కావాల్సివున్నది అవి ఆ యంత్రాలవల్ల తయారు చేయించి విదేశాలకు ఎగుమతి చేస్తేగాని మనకు ఖర్చుకాదు. Medium cloth, coarse cloth విదేశాలకు పంపిస్తే అది అక్కడ ఖర్చు కాదు. అక్కడ ఖర్చు అయ్యేది చీనీ చీనాంబరాలు, సన్నని, అతి సన్నని గుడ్డ, దుకూలాలు. Coarse cloth మీద పన్ను ఎక్కువవేస్తే విదేశ మార్కెటు దెబ్బతింటుంది. అందుచేత వాటిమీద surcharge తక్కువ వేస్తాము.

డాక్టర్ బి. గోపాలరెడ్డి : చీనాంబరాలు అంటే silk cloth అంది.

శ్రీ పి. సుందరయ్య :- చీనీ అంటే ?

డాక్టర్ బి. గోపాలరెడ్డి : చీనీ అంటే China అని అర్థము.

శ్రీ పి. సుందరయ్య : గోపాలరెడ్డిగారు శాంతి నికేతనములో పట్టభద్రులు అయినారు. గనుక వారికి తెలిసియుంటే తెలిసియుండవచ్చు. నేను అట్లాకాలేదు అనుకోండి. అయినను ఈ చీనిచీనాంబరాలకు గోపాలరెడ్డిగారు చెప్పినఅర్థము సరియైనది అవునోకాదో Dictionary చూచి తెలుసుకోవలసియుంటుంది. ఆ విషయమును గురించి తరువాత తర్కించుకోవచ్చు. అయినను పాండిత్యము విషయములో గోపాలరెడ్డిగారితో నేను పోటీచేయదలచలేదు, కాని, పాండిత్యము విషయములో నేను వారితో పోటీ చేయలేకపోయినను, ఈ Sales Tax Bill విషయములో మాత్రము నేను వారితో పోటీ చేయదలచుకున్నాను. వీటికి అర్థము నిర్ధారణచేసే విషయములో మనకు కావలసినంత అవకాశము తరువాతతీసుకుని చర్చించుకోవచ్చు. ఇప్పుడు దానికి సమయము లేదు.

సన్నని, అతిసన్నని గుడ్డ విదేశాలకు పంపించవలసియుంటుంది. Coarse cloth మీద రాష్ట్ర ప్రభుత్వము ఇదివరకే ఎక్కువ surcharge వేస్తున్నారు గనుక, ఆ వేసే ఎక్కువ surcharge ఈ సన్నని, అతిసన్నని బట్ట మీదవేసి, రాష్ట్ర ప్రభుత్వము ఇప్పటివరకు ఎంత వసూలు చేస్తున్నదో అంతకు తక్కువకాకుండా, ఆ రేటులోనే భర్తీ చేస్తామని చెప్పితే, అప్పుడుమాత్రము

కొంప మునిగిపోయ్యేది ఏమి వున్నది ? "మేము మా ప్రజలమీద యెక్కువ పన్ను వేస్తున్నాము. అందువల్ల ఆ పన్నుఅంతా అంతకు తక్కువలేకుండా మీరుఇవ్వండి" అని కేంద్ర ప్రభుత్వాన్ని అడిగే బదులు coarse cloth మీద, medium cloth మీద పన్ను లేకుండా చేయడం మంచిదే. "మేము ఎక్కువ surcharge వేస్తాము. మీరు వసూలు చేసుకునేదానికంటె తక్కువ కాకుండానే ఇస్తాము కాని, సన్నని గుడ్డమీద, అతిసన్నని గుడ్డమీద పన్ను తక్కువగా వేస్తామని" వారు అంటే మనము చేసేదిఏమిటి ? అందువల్ల పేదప్రజలు, సామాన్య ప్రజలు ఉపయోగించుకొనే coarse cloth, medium cloth మీద ఎక్కువ పన్ను వేస్తామనేది, పెద్దసూత్రము, పెద్ద సాంప్రదాయము అని చెప్ప వలసి ఉంటుంది. కేంద్ర ప్రభుత్వము అయినా ఇక పన్నువేయడము వీటి మీదనే సాగించి, విదేశాలకు ఎగుమతి సాగిస్తామనే పేరుతో, అక్కడికి పం పించే వస్తువులమీద ఇంకా తక్కువ పన్ను వేసుకోటానికి మనమే ఒప్పుకున్న వారమవుతాము. దానికి మాత్రము మేము తయారుగా లేము. మేమే కాదు. ఏ రాష్ట్ర ప్రభుత్వము కూడా తయారుగా వుండకూడదు. అందువల్ల ఈ medium cloth మీద, coarse cloth మీద పన్ను చాలామటుకు తగ్గించా లని నా సూచన. చక్కెర, బెల్లము మీద తెలంగాణాలో మాత్రము మొన్న మొన్నటిదాకా పన్నులేదు. చక్కెరమీద, రు. 0-1-3 పన్ను ఉండేది. ఆంధ్ర రాష్ట్రము ఉన్నప్పుడు దీన్ని మార్చటానికి ఒక amendment pass అయిన ప్పటినుంచి, అంటే, ఈ నాలుగు, ఆరు నెలలనుంచి పన్నువేయడము జరుగు తున్నది. ఇప్పుడు ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడ్డది. అదేమాదిరి తెలంగాణాలో కూడా ఈ పన్నుపెంచటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. పోనీ, రు. 0-1-3తో నైనా ప్రభుత్వము ఆగినదా ? మరల ఆ రు. 0-1-3ని ఇప్పుడు నయా పైసలు వచ్చినవి గనుక, దీనిని నయాపైసలలోనికి మార్చాలనే ఉద్దేశ్యముతో ఇంకా ఒక పరసెంటు ఎక్కువచేసి పన్ను వసూలు చేయటానికి చూస్తున్నారు. ఈ రీతిగా ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వము ఇక్కడ ఎంత ఎక్కువ పన్నువేసి వసూలు చేసుకుంటే, అంత ఎక్కువ రేపు కేంద్ర ప్రభుత్వమునుంచి సంపా దించుకోటానికి ఆలోచిస్తున్నారు. కేంద్రప్రభుత్వోద్యోగులు నిద్రపోతున్నారు. మన రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు మేల్కొని వున్నారు అనుకొని, కేంద్ర ప్రభుత్వోద్యోగులను తేలికగా దోకా కొట్టవచ్చునని అనుకున్నారు కాబోలు. ఈ విధముగా ఆలోచించడము సరియైనదికాదు. కేంద్ర ప్రభుత్వోద్యోగులు అంత తేలికగా మీరువేసే వలలో పడరు వారుకూడా నిద్ర మేల్కొనే ఉన్నారు. అయితే మీరు ఎంత వసూలు చేసుకుంటూంటే మేము అంతకు ఒక్క పైసాకూడా తక్కువ లేకుండా ఇస్తామని కేంద్ర ప్రభుత్వము చెప్పి.

నట్లయితే, ఆవిధముగా చెప్పేసూత్రము తప్పు. "దానికి మేముఅంగీకరించము. మా రాష్ట్ర జనాభా ప్రకారము మాకు జనాభా దామాషానుబట్టి ఇవ్వండి" అని రాష్ట్ర ప్రభుత్వము కోరవలసియున్నది. అంతే కాని రాష్ట్ర ప్రభుత్వము ఎంత వసూలు చేసుకుంటే అంతా ఇస్తామనడము తప్పు అని అంటాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- కేంద్ర ప్రభుత్వమువారు యింతవరకు ఏ principle కూడ నిర్ధారించి చెప్పలేదు. రాష్ట్రప్రభుత్వము ఎంత వసూలు చేసుకుంటు న్నారో అంతకు తక్కువ కాకుండా యింకా హెచ్చుగానే యిస్తామనే భావము సూచించినారు. అంతేకాకుండా రాష్ట్రప్రభుత్వములు అన్నీ ఒప్పుకుని తీసు కున్నదేకాని, వారు ఏదో గ్రహించి తీసుకున్నదికాదు.

శ్రీ పి. సుందరయ్య:- వచ్చిన చిక్కల్లా అక్కడే; ఈ విధానానికి రాష్ట్రప్రభు త్వాలు ఒప్పుకోవడమే మొదటి తప్పు. అసలు ఏ basis మీద యీ సర్చార్జి వేయబోతున్నారు? Medium cloth మీద, coarse cloth మీద తక్కువ గావేసి, Fine, Superfine cloth మీద ఎంతవేయడము అనేది తేల్చుకో లేదు. Coarse clothమీద రాష్ట్ర ప్రభుత్వాలు ఎక్కువవేసి, కేంద్ర ప్రభు త్వానికి దారిచూపినట్లు అవుతున్నది. కేంద్ర ప్రభుత్వం యొక్క విధానము యిందులో స్పష్టముగా కనబడుతున్నది. విదేశాలకు ఎగుమతి అయ్యే వస్తువు లమీద పన్నులు తక్కువవేసి, పేదప్రజలు, సామాన్యప్రజలు ఉపయోగించు కునే గుడ్డమీద ఎక్కువగా వేస్తే, అది వారు భరించేలేని స్థితిలో ఉంటారు. విదేశాలకు పంపించే వస్తువులమీద తక్కువపన్ను వేస్తున్నప్పుడు, సన్నని, అతిసన్నని గుడ్డమీద వారు పన్ను తక్కువ వేసే ధోరణి కేంద్రప్రభుత్వము నకున్నట్లు కనబడుతున్నప్పుడు, అది ఏ basis లో ఎంత వేస్తారో తేల్చుకో కుండా, యిక్కడ పేద ప్రజలమీద ముందుగా పన్ను ఎక్కువగా పెంచడము అయితే, మనమే కేంద్రప్రభుత్వానికి దారి చూపించడము తప్ప మరేమికాదు. దీనికి మన రాష్ట్రప్రభుత్వము ఒప్పుతుంటే, అది తప్పు అని మాత్రమే చెప్ప వలసిఉంటుంది. అదే గనుక కేంద్రప్రభుత్వము యొక్క దృక్పథమే అయి తే, దానిని మనము శాశ్వతముగా అంగీకరించినట్లే. ఈ విధానాన్ని ఒప్పుకు నే స్థితిలో మేము తయారుగాలేము. అందువల్ల యీ coarse cloth మీద, medium cloth మీద పన్ను తగ్గించి తీరాలి అని మా అభిప్రాయము.

తరువాత పసుపు విషయము తీసుకోండి. బిల్లులోని మూడవ షెడ్యూలు చూడండి. ఇందులో Mica, Manganese, Iron, Tobacco, Rice, కొబ్బరి, వీటి అన్నిటిమీద షూదేసి నయాపైసలు వేస్తున్నారు. పసుపు దగ్గర కు వచ్చేటప్పటికి ఆరు నయాపైసలు అంటున్నారు. ఎందుకు? పసుపు

చేసుకున్న ప్రత్యేక పాపము ఏమిటి ? మిగిలిన అన్నింటిమీద మూడు నయా పైసలు వేసి, ఒక్క పసుపుమీద మాత్రము ఆరు నయాపైసలు ఎందుకు వేయవలసివచ్చింది ? మిగిలినవి మాత్రము ఆరు నయాపైసలు భరించలేవా ? ఈ ఒక్క పసుపు మాత్రము ఆరు నయాపైసలు భరించుకోగలదా ? వాస్తవముగా చూస్తే, యీ రోజులలో పసుపు, ప్రజలందరు, పేద ప్రజల దగ్గర నుంచి, అందరూ, ఉపయోగించుకునే వస్తువే. దానిమీద ఎక్కువ పన్ను వేస్తే పేదవాళ్ళు భరించుకోలేరు. అందువల్ల పసుపుకుగూడ మూడుపైసలకు తగ్గించండి.-పసుపు వ్యాపారస్తులకు పసుపుమీద ఎక్కువగా లాభాలు వస్తాయి. కాబట్టి, వారికి వచ్చే లాభాలలో కొంతభాగము ప్రభుత్వానికి యిస్తే, వచ్చే నష్టమేమీలేదు. అపైకము రాష్ట్రములోని అభివృద్ధి కార్య క్రమాలకు ఉపయోగించవచ్చును గదా ! Sales Tax Enquiry Commission వారు కూడ యిదే అభిప్రాయము వెలిబుచ్చారు. ఈ tax రైతులవద్దనుంచి వసూలు చేయకూడదు. ఇది రైతులమీద పడకుండా, మొట్టమొదటి కొనుగోలుదార్ల వద్దనుంచే వసూలు చేయాలి. దానికి తగిన రూల్సు మేము చేస్తాము అని, ప్రభుత్వము తరపున ఉద్యోగ బృందమువారు కానివ్వండి, మాజీ మంత్రులు కానివ్వండి, ప్రస్తుతపు మంత్రులు కానివ్వండి ఆలోచించి చేసిన విషయము ఇది. అయితే అది ఆచరణలో ఎట్లా జరుగుతున్నదిన్నీ నావద్దకు అనేక పిటిషనులుకూడ వచ్చినవి. ప్రతి వ్యాపారస్థుడు రైతు దగ్గరనుంచి పొగాకు కొన్నప్పుడు Sales Tax అని వ్రాయటానికి బదులు, కమిషను అనో, ధర్మమనో, ఏదో విధముగా తప్పించుకోటానికి వీలు ఉంటున్నది. ఇది వరకు లేనటువంటి సాంప్రదాయమిది. కమీషను అనేది తెచ్చిపెట్టడము క్రొత్త సాంప్రదాయము. Purchase tax అనేది ఎంత అయితే యీ వ్యాపారస్థులు కట్టుకోవలసిఉంటుందో, అంతయుకూడ రైతుల దగ్గరనుంచే వసూలుచేస్తున్నట్లు కనబడుస్తున్నారు. ఇది ఏమిటి అని అడిగితే "ఇది కమిషను క్రింద" అని, "ఇది ధర్మముక్రింద" అని చెబుతూ, దీనిని రైతులనుంచి మినహాయింపు చేస్తున్నట్లు తెలుస్తున్నది. ఈ విధముగా జరుగుతున్నది. దీనిని check చేయండి అని ప్రభుత్వముయొక్క దృష్టికి తెచ్చినప్పటికినీ, "యీవిషయలో మేమేమిచేయలేము" అని చెబుతున్నారు. రైతుకు చూస్తే ప్రభుత్వము గ్యారంటీ చేయలేదు. ఈ పన్ను భారము రైతుమీద పడకుండా ప్రభుత్వము ఏమీ చేయలేకపోతున్నది. ఈవిధముగా చెప్పడము యీ ఆరు నెలలుగా జరుగుచున్నది. రైతులవద్దనుంచి యీ విధముగా వసూలు చేయడము న్యాయముకాదు. అంతేకాకుండా పసుపు పుట్టి ఒకటింటికి యిదివరలో ఏ మూడు వందలో ఉంటూఉండేది. అలాంటిది యిప్పుడు ఏ నూరు, నూట

యాభై రూపాయలకో తగ్గినది. పసుపుకు ధర లేనప్పుడు యీ పన్నుభారము ఎప్పుడు చూచినను ఒకే విధముగా, ఒకేరేటులో వసూలు చేస్తున్నారు. అసలు యీ పన్ను రైతువద్దనుంచి వసూలు చేయడమనేది తీసివేసే సంగతి అటుంచి, యీ పన్ను భారము తగ్గించటానికైనా ప్రభుత్వము పూనుకోకుండా, "మాకు యిప్పుడు డబ్బు కావాలి, మాకు ఆదాయము కావాలి" అని పన్ను పెంచడము అవసరమని చెప్పడము సరైనది కాదు. అందువల్ల పసుపుమీద వేసే ఆరు నయాపైసలను. మూడు నయాపైసాలకు తగ్గించమని చేసిన సూచన అయినా అంగీకరించటానికి ప్రభుత్వము నిరాకరిస్తున్నది.

ఈ పన్నులు, రేట్ల విషయంలో ఇవన్నీ అన్యాయంగా చేస్తున్నారనే చెప్పాల్సి ఉంటుంది. నేను ఒక్కడనే ఎక్కువసేపు తీసుకొంటే చాలా ఆలస్యం అవుతుంది అన్నారు. మిగిలిన శాసనసభ్యులుకూడా ఇంకా చాలా విషయాలు చెప్పవచ్చు. సవరణకు వచ్చినపుడు రేట్ల సంగతి ఆలోచిస్తాము అన్నారు. ఈ చట్టంలో ఉన్న మరొక ముఖ్య విషయం ఏమిటంటే-ప్రజలను వర్తకులను వేధిస్తున్న సమస్య Penal Provisions. Penal Provisions అంటే అపరాధ శిక్షలు, అపరాధ పన్నులు, నేరాలు చేసినందుకు ప్రభుత్వం విధించేటటువంటి శిక్షలు Section 28, 29, 30, 31. ఈ 4 clause లు దీనికి సంబంధించినవే. వర్తకులందరూ ప్రధానంగా వ్యతిరేకించింది right of search and right of cease. సోదాచేసి account పుస్తకాలు మొదలైన వాటిని స్వాధీనం చేసుకొనే అధికారం ఉద్యోగస్థులకు ఉండవలెనా ? ఉండకూడదా అనే సమస్య మీద చాలా తర్జన భర్జనలు జరిగాయి. 1956 Amendment Act వచ్చేవరకు ఏ ఉద్యోగస్థుడంటే ఆ ఉద్యోగస్థుడు వెళ్ళి సోదాచేసి పుస్తకాలు cease చేసేదానికి అధికారం లేదు. అయితే అదివరకు చేయలేదా అంటే తప్పుచేశారని కోర్టుకువెళ్ళి దెబ్బలాడుకొనే దానికి శక్తి లేకో, లేక తెలియకో, లేకపోతేఅటువంటి అధికారం ఉంటుందేమోనని ఊహించో ఊరుకోబట్టి, కొన్ని కొన్ని సందర్భాలలో చేసినా నిజంగా అటువంటి అధికారాలు మాకు లేవు అని అధికారులంతా ఏకగ్రీవంగా అంగీకరించారు. అయితే తప్పుడు లెక్కలు పెడుతున్నారు. పన్ను కట్టాల్సింది చూపించడంలేదు. పన్నులు ఎగేస్తున్నారు. వీటన్నింటిని check up చేయాలంటే సోదా చేసేదానికి అధికారం ఉండాలి. సోదాచేసిన తరువాతకనపడని పుస్తకాలుఉంటే, వాటిని (cease) చేసే దానికి,వాటిని స్వాధీనం చేసుకొనే దానికి మాకు హక్కు ఉండాలి అని అధికారులుకోరినపుడు, పన్ను వేసినపుడు ఆ పన్ను సక్రమంగా వసూలు చేసేదానికి కొన్ని అధికారాలు ఉండాలి అనేటటువంటి దానిలో మాకేమి అభిప్రాయ భేదంలేదు. అయితే వర్తకుల విషయం ఏమిటి? మేము పన్నుకట్టి

డానికి తయారుగానే ఉన్నాము. లెక్కలుచూపించేదానికి తయారుగానే ఉన్నాము లెక్కలు చూపించనటువంటివాళ్ళమీద పన్నులు కట్టనటువంటివాళ్ళమీద ఏ శిక్షలు, ఏ నిర్బంధాలు వేసినా సిద్ధంగానే ఉన్నాము. కాని మీ ఉద్యోగస్థులంతా నీతిపరులని, సన్మార్గులనిగాని, చట్టాల ప్రకారం సక్రమంగా నెరవుతున్నారని మాకు ఏ మాత్రంకూడా నమ్మకం లేదు అని అంటున్నారు. Sales Tax Enquiry Commission ముందు ఈ విషయం వచ్చినపుడు మేము ఉద్యోగస్థులను అడిగాము "ఉద్యోగస్థులలో లంచగొండితనం ఎంత ఉంటుంది" అని. లంచాలు తీసుకొనేవాళ్ల 100కి ఇద్దరు ముగ్గురుకన్న ఎక్కువ లేరు. మిగతా వాళ్లంతా సన్మార్గులనే చెప్పారు. వర్తకులను అడిగితే 100కి 70 మంది లంచాలు తీసుకుంటారు. అంతకన్న ఎక్కువే ఉంటుంది కాని తక్కువ లేదని ప్రతి వర్తక ప్రతినిధి చెప్పారు,

డాక్టర్. బి. గోపాలరెడ్డి:— Merchants లో accounts నుఎంతమంది suppress చేస్తున్నారో అడిగారా ?

శ్రీ పి. సుందరయ్య :— అదికూడా అడిగాము. అడిగితే దాదాపు అందరు suppress చేస్తున్నామని చెప్పారు. చేస్తున్నాము, ఇకముందు చేస్తామని కూడా చెప్పారు. ఆ విషయంలో వాళ్లేమి దాచుకోలేదు. మీ పన్ను ఈ విధంగా ఉన్నంతకాలం, మీ ఉద్యోగస్తుల ప్రవర్తన ఈ రీతిగా ఉన్నంత కాలము, మీ బలాన్ని ఉపయోగించి పెద్దపెద్దవాళ్లను నొక్కిపెట్టి, చిన్నచిన్న వాళ్ల దగ్గర వసూలుచేస్తూ మీరు మీ శక్తిని చూపిస్తామని అనుకొన్నప్పుడు మా శక్తితో మేము చేయగలిగినంతవరకు చేస్తాము. ఇద్దరిలో ఎవరో తేల్చుకొంటామని కూడా చెప్పారు. వర్తకులు ఏమీ అబద్ధం చెప్పలేదు.

శ్రీ వాసుదేవ నాయక్ (సుల్తాన్‌బజార్):-Mr. Speaker, Sir, వర్తకులు స్పష్టంగా ఈ రీతిగా "మేము accounts suppress చేస్తున్నాం చెయ్యబోతున్నాం" అని ధైర్యంతో చెప్పడం చేయడం, సాధ్యం కాదు అని నేను నమ్ముతున్నాను. కనుక opposition leader ఇక ఆ విషయం గురించి చర్చించకుండా ఉండటం మంచిది.

శ్రీ పి. సుందరయ్య:— గౌరవసభ్యులు చెప్పినదానికి ఏమి సమాధానం చెప్పాలో నాకు తెలియడం లేదు. Sales Tax Enquiry Commission ముందు జరిగిన విషయాన్ని నేను చెపుతున్నాను. వాళ్లు ఆ రకంగా చెప్పడం ఆశ్చర్యం ఏమి లేదు. అయితే వాళ్లు ఒక విషయం చెపుతున్నారు, "మీరు మమ్మల్ని నమ్మండి. మిమ్మల్ని మేము నమ్ముతాము. మీ ఉద్యోగసులకు కావలసిన తోడ్పాటులన్నీ మేము ఇస్తాము. అంతేకాని మమ్మల్ని మీరు నేరస్థులుగా పరిగణించి, దొంగ

తనం చేసేదానికోసమే మేము కూర్చున్నట్లుగా, మీరు మీ ఉద్యోగస్థులు సన్మార్గులు. వాళ్లే న్యాయపరులు అని అనుకోవడం సరైనది కాదు. మాకు ఈ Sales Tax లో కొన్ని ఇబ్బందులు ఉన్నాయి. చిన్నచిన్నవాళ్లమీదనే అనేకం పడుతున్నాయి. అందుచేత మా ఇబ్బందులను కూడా మీరు గమనించి మేము దివాళా తీయకుండా, మేము కాస్త తిని బ్రతికేదానికి మార్గం చూపితే ప్రభుత్వం యొక్క ఆదాయం పెరిగేదానికి అన్నిరకాలా సహకారము చేస్తాము" అని కూడా చెప్పారు. ఇంకో ప్రశ్నకూడా అడిగాము. "ఈ Sales tax ను మీ స్వంత లాభాలనుంచి కట్టుమనలేదుకదా ? ప్రజల దగ్గరనుంచి వసూలు చేసు కోడానికి హక్కు ఇచ్చాము. ఆ వసూలు చేసినదానిని ప్రభుత్వానికి కట్టు మంటే మీకు వచ్చిన నష్టం ఏమిటి ? ఎందుకు కట్టరు" అని అడిగితే వాళ్లు చెప్పింది ఇది. "ప్రజల దగ్గరనుంచి వసూలు చేసినది కట్టడానికి మాకేమి అభ్యంతరం లేదు. మేము కడతాము. Multi point వల్ల వర్తకంలో అనేక రకాల పోటీపడడం ఒకవర్తకుడు ఎక్కువ ధరకు అమ్మడం, ఇంకోవర్తకుడు తక్కువధరకు అమ్మడం, దీనివల్ల చాలమంది వర్తకులు దివాళా తీయవలసి వస్తుంది. Sale tax department కు మేము ఖచ్చితంగా లెక్కలు చూపించి, ఆ లెక్కల ప్రకారం పన్నుకడితే Income tax department వచ్చి నీ కింత turnover ఉన్నది. ఇంత sales tax వసూలు చేశావు అంటే ఇంత ఆదాయం ఉండితీరాలి అని మేము ఇచ్చిన లెక్కలు త్రోసిపారేసి, ఇవన్ని తప్పుడు లెక్కలు మేము నమ్మము అని వాళ్ల యిష్టము వచ్చినట్లు at our discretion we have got right అని చెప్పి. పన్నువేసినీవు కావాలంటే Income Tax Tribunal కో. కోర్టుకో వెళ్లఅని చెప్పి ఆ హక్కును వినియో గించిమామీద విపరీతమైనటువంటి ఆదాయపు పన్ను వేస్తున్నారు. దానితోమేము దివాళా తీస్తున్నాము. Sale tax కోసమని సక్రమైన లెక్కలు చూపించి దానినుంచి బైటపడి దానివల్ల నష్టం లేకపోయినా Income tax వల్ల దివాళా తీస్తున్నారు, ఒక department కు ఇంకో deparment కు సంబంధం లేదనే విషయం అనేకమంది వర్తకులకు తెలుసు. Income tax వాటన్నింటి లోకి పోయి దానిలోతు పాతులన్ని చూడలేదు. వర్తకులు చెప్పినది వాస్త వము అవునా ? కాదా అంటే దానికి అనేక ఉదాహరణలు చెప్పారు. ఆఖరికి వాళ్లు ఒకమాట చెప్పారు. మీ department అంతా న్యాయం అని అను కోము. 100కి 100 మంది అనిచెప్పలేదు. 100కి 70 మంది అని మాత్రమే చెప్పారు. మా వర్తక సంఘాలను గుర్తించి మా వర్తక సంఘాల తరఫున బాధ్యులైనటువంటి వాళ్లను దగ్గరపెట్టుకొని సోదాచేయండి. మీ ఉద్యోగస్థులు arrest చేయకుండా హామీకూడా ఇవ్వాలి. అటువంటిదేమీ లేకుండా మీ

ఉద్యోగస్థులను నమ్ముకుని వాళ్ల యిష్టం వచ్చినట్లు సోదాచేసి లెక్కల పుస్తకాలు తీసుకొంటామని, కేసులు పెడతామని బెదరించి, ఇంకా కాస్త ఎక్కువ మామూళ్ళనజరానాలోసంపాదించేదానికిమార్గంచూపిస్తున్నారుతప్పఅంతకన్న, ఇంకేమి లేదు. సోదాచేసేటప్పుడు arrest చేయకుండా హామీ యిచ్చి, మా వర్తక సంఘాలను గుర్తించి, మా ప్రతినిధులనుగాని, లేక సంఘాలలో బాధ్యులైనటువంటి వాళ్లనుగాని దగ్గర పెట్టుకొని సోదాచేసి (cease) చేసేదానికి మాకేమీ అభ్యంతరంలేదు. Sales Tax Enquiry Committee ఉద్యోగస్థులందరూ దీనిని ఏకగ్రీవంగా సమీక్షించారు. కర్నూలులో Bill pass చేసినపుడు ఆ సూచనలను ఏ మాత్రం అనుసరించారు? చిన్న వర్తకుల, పేదప్రజల సహకారంతో వసూలు చేయగలిగిన వాళ్లదగ్గరనుంచి వసూలు చేస్తామనే ప్రాతిపదికమీద Sales Tax Enquiry Committee లో వర్తకులు, ఉద్యోగస్థులు అందరు కలిసి చేసిన సూచనలను బుట్టదాఖలా చేసిపారేసి, ఏ ఉద్యోగస్థుడంటే ఆ ఉద్యోగస్థుడు, ఎప్పుడంటే అప్పుడు వెళ్లి సోదాచేసి cease చేసేందుకు హక్కు ఇస్తూ ఆ బిల్లును ఎందుకు pass చేశారు?

కమిటీ తరఫున బాధ్యత గలిగినవారు, ఉద్యోగస్థులు ఇచ్చినటువంటి హామీలన్నింటినీ కూడ బుట్ట దాఖలు చేసిన తరువాత ఏమిని చెప్పగలం? ఈ చట్టం ప్రకారం ఎవరంటే వారు, ఎక్కడకుబడితే అక్కడకు వెళ్లి సోదా చేయవచ్చు. Magistrate దగ్గరనుంచి warrant తీసుకొనిపోయి సోదా చేయవచ్చునన్నారు. మనదేశంలో దురదృష్టవశాత్తు విదేశస్థుల నుంచి కూడా పోలీసు దృక్పథం, ఉద్యోగ దృక్పథం ఉన్నది. ఇది ఇంకా ఎంతకాల ముంటుందిఅనుకొనే పరిస్థితులలో మళ్లా cease చేసే హక్కు ఉద్యోగస్థులకు ఇవ్వడం అంటే "దారినపోయే శనిగ్రహాన్ని ఇంట్లోకి రమ్మన్నట్లు"గా ఉంటుంది. తప్పితే ఇంకొకటి కాదు. కాని దీనికి వర్తకులంతా వ్యతిరేకించడానికి అభ్యంతరం ఏమిటి? వెనుక మేము చేసిన సూచనలన్నింటినీ కూడ ప్రభుత్వంవారు త్రోసిపారేశారు. మొన్న Select Committee లో ఈ విషయంగురించి బిల్లులో ఏదైనా వచ్చినట్లయితే రూల్సులో చేస్తామని చెప్పారు. రూల్సులో చేసేటప్పుడు చట్టంలోనే ఎందుకు పెట్టకూడదు. "Criminal Procedure Code కు వ్యతిరేకం కానిరీతిగా warrant తీసుకొని పోయి సోదా చేయవచ్చు"అనేవాక్యం పెట్టినప్పుడు, స్థానికంగా అక్కడి వర్తక సంఘాలలోని బాధ్యతలుకూడ ఉండాలి. 'In the presence of a respectable man' అనేబదులు In the presence of all the Members in the Executive Committee అని Act లో ఎందుకు పెట్టకూడదు? రూల్సులో పెడతామంటే మీకు నమ్మకం లేదా అంటే ఏమి చెప్పాలి? ఇది

వరకు నమ్మినాము. కాని Sales Tax Enquiry Committee లో ఆ రకంగా సూచనలు చేశారు. అవన్నీ బుట్టదాఖలుచేసి Criminal Procedure Code ను pass చేసినతరువాత. మళ్లీ 6 నెలలు అయిన తరువాత మళ్లా సెలక్టు కమిటీతో దెబ్బలాడితే రూల్సులో చేస్తామని. మీరు అధికారం తీసుకున్నామని చెబితే నమ్మమంటారా ? నమ్మకచేసేదేమీలేదు. రూల్సువస్తే మేము ఏమి చేస్తాము ?

ఆ హక్కు విషయమై వర్తక సంఘాలలో అసలు రెండు ఉద్దేశాలున్నాయి. వర్తకులపైని harassment తగ్గించడం ఒకటి. ఉద్యోగస్తులమీద check up ఉంచడం మరొకటి. దానితోపాటు సేల్సుటాక్సు వసూలు కావాలంటే వర్తకుల సహకారం లేకుండా కేవలం ఉద్యోగస్తుల శక్తితో, ప్రభుత్వంయొక్క శక్తితో పన్నులు వసూలు చేయగలగడమనేది అసంభవం అనే విషయం ఋజువైనది. "మేము పోటీ పడతాము. నిర్బంధముగా వసూలు చేస్తామంటే ఎట్లా వసూలు చేస్తారో మేమూ చూస్తామనే" రీతిగా వారు తంటాలు పడుతున్నారు.

ఈ విషయమై భీమవరంలో చాలా సహకారం చేస్తున్నారని చాలమంది చెబుతారు. భీమవరంలోనివారు ప్రత్యేకంగా వచ్చారా ? భీమవరంలోనివారు నిజంగా ఎక్కువ పన్నులు వసూలు చేస్తున్నారా? వర్తకులదగ్గరనుంచి లోపలకుపోతే ఏమి వుంటుందో, మరి మీరూ వెళ్ళి చూడలేదు. మేమూ వెళ్ళలేదు. అన్నిచోట్లకంటె ఎక్కువ వర్తకం చేసే centre లో ఎక్కువ పన్నులుకూడ వసూలు అవుతాయి.

"ఈ వర్తక సంఘంలో పన్నువసూలుకోసం ఎంతమంది పని చేస్తున్నారని" మేము అడిగాము. 17 మంది పని చేస్తున్నారన్నారు. సరైన లెక్కలు నా దగ్గరలేవు, డిపార్టుమెంటు దగ్గర వుంటాయి. ఆ వర్తక సంఘం తరఫున గుమాస్తాలుగాని, watchers గాని వచ్చిన ప్రతి బండినీ, ప్రతి లెక్కనూ check up చేయడానికి భీమవరంలో 17 మంది వున్నారని చెప్పారు. Sales Tax Department నుంచి అయిదు మందికంటే ఎక్కువలేరు. అక్కడ 17 మంది పన్నులు వసూలుచేసి ప్రభుత్వానికి ఇస్తున్నారు. Department వారు అయిదుగురుకంటే ఎక్కువలేరు. 17 మంది వర్తక సంఘంలోనివారు ఇంటింటికీ తిరిగి తమ స్వంత పనిగా భావించుకొని, తమ మర్యాదను కాపాడుకొని, ఆదర్శంగా ఉండాలనుకొని ఈ కాంగ్రెసు ప్రభుత్వానికి తోడుపడదామనే ఉద్దేశ్యంతో పనిచేస్తుండే డిపార్టుమెంటువారు 5 మంది ఉద్యోగులను మాత్రమే ఉంచారు.

[ Mr. Speaker in the Chair ]

అధికారాలున్నాయని చెప్పి మేమే వసూలు చేస్తామంటే అట్లు వసూలు చేయటం సాధ్యమవుతుందా ? Staff విషయంలో చూచినప్పటికిన్నీ Sales Tax Department వారి staff కంటే వర్తక సంఘాల సహకారంతో పని చేసే staff 3 రెట్లు ఎక్కువయున్నది. వారు తమ సంఘం తరపున అది తమ స్వంతపని యనుకొని భావించి పనిచేస్తున్నారు. అట్లా న్యాయంగా పని చేయడానికి తయారైన ఉద్యోగస్థులు ప్రభుత్వానికి దొరికినప్పటికీకూడ, 3 రెట్లు పెంచినట్లయితే ప్రభుత్వ డిపార్టుమెంటుకు ఎంత ఖర్చు లవుతుందో ఆలోచించండి. అటువంటివారు దొరుకుతారా అంటే ఆ విషయంలో ప్రభుత్వంవారికి ప్రభుత్వ డిపార్టుమెంటుకు కూడా నమ్మకం లేదు. ఈ పరిస్థితులలో వర్తకుల సహకారంలేనిదే పన్నులు వసూలు చేయడం సాధ్యంకాదు. ఎన్ని check up లైనా చేయండి, ఎన్ని check post లు అయినా పెట్టుకోండి. (Search) సోదా అధికారాలు తీసుకోండి, జైలు అధికారులు తీసుకోండి. ఏమి చేసినాకూడ వర్తకుల సహకారం లేనిదే పన్ను వసూలు చేయడం సాధ్యంకాదు. వర్తక సంఘాలు కావాలని మేముగట్టిగా insist జేసినట్లయితే, ఆ వర్తక సంఘాల ప్రాముఖ్యతను ప్రభుత్వంవారుగుర్తించి వారిని ప్రోత్సహించి, వర్తక సంఘాలమీదనే ఆధారపడుతున్నాము. పన్నులు వసూలు చేస్తున్నాము అని చెప్పి, వారికి హామీ ఇవ్వండనే సూత్రాన్ని ఈ ప్రభుత్వంవారు త్రోసిపారేశారు. ఇప్పటికైనా అంగీకరించాలి, Select Committee లో ఈవిషయం అంగీకరిస్తామనిచెప్పారు. అట్లా అంగీకరించినట్లయితే ఈ Sales Tax గొడవనుంచి కొంతవరకైనా బయట బడడానికి అవకాశం ఉంటుంది. దానితోపాటు Penal Code శిక్ష విషయం గురించి మేము Sales Tax Enquiry Commission లో అడిగినప్పుడు చాలా తర్జనభర్జనలు జరిగాయి. ప్రతిఉద్యోగిని అడిగాము. వర్తకులను అడిగాము. సామాన్య ప్రజలను అడిగినాము. ఈ రీతిగా తప్పుడు లెక్కలుపెట్టి పన్నుఎగవేస్తామనేటటువంటివి అనేక ఉదాహరణలు చెప్పవచ్చు. శిక్ష వేయడంలో 2, 3, 4, 5 వేలు fine వేసినట్లయితే అతనికి 5 వేలుకాదు. 50 వేలు అయినా లెక్కకాదు. కట్టివేయగలడు. అందుచేత వారికి భయం లేకుండా పోతుంది. చట్టాన్ని ధిక్కరించే ధోరణి వస్తోంది. మేము అడిగినప్పుడు అందరూకూడా ఏకగ్రీవంగా వ్యతిరేకించారు. నేరస్థుల మాదిరిగా వీరిని పరిగణించి imprisonment వేస్తున్నారు. "మేము అటువంటి వారము కాదు, అందువల్ల మేము దీనిని ఒప్పుకోము" అని వర్తకులంతాకూడా వ్యతిరేకించారు. మేము ఏమి తప్పు చేశామని ఈ పన్నులు వసూలుచేసే బాధ్యత మామీద పెట్టారు ? ప్రజలనుంచి వసూలుచేసి ప్రభుత్వానికి ఇవ్వడానికి మేము జీత

గాళ్ళమా? మాకు డబ్బు ఇస్తున్నారా? (వాళ్లు) వర్తకులు అడిగే ప్రశ్నలివి. ఇది ఏరీతిగా నేరం అవుతుంది? ప్రభుత్వం ఏమీడబ్బు (ప్రతిఫలం) ఇవ్వకుండా ప్రజల దగ్గరనుంచి డబ్బు వసూలుచేసి ఇవ్వవలసిన బాధ్యత ఏమిటి మాకు; Breach of Trust క్రిందగాని, ఇంకో రీతిగా గాని తప్పుకాదా అంటే, అసలు పన్ను వసూలు చేయవలసిన బాధ్యత మామీద ఎందుకు ఉంది? మాకు ఏమైనా జీతం ఇస్తున్నారా? బత్తెం ఇస్తున్నారా? రాళ్లు ఇస్తున్నారా? రప్పలు ఇస్తున్నారా, మేము ఎందుకు వసూలు చేయాలి? డిపార్టుమెంటువారు తగిన సిబ్బందిని పెట్టుకోండి. Sales Tax వసూలు చేసుకోండి, మేము ఊరి కనే ప్రభుత్వానికి పని చేస్తుంటే అది కట్టలేదు, ఇది కట్టలేదు అని శిక్షలు వేయడానికి తయారౌతున్నారు. దేశం అభివృద్ధికొరకు మేము వ్యాపారంలో వున్నాం కాబట్టి, ప్రజల సహకారం లేనిదేపనులు సక్రమంగా జరుగవు కాబట్టి మేము చేస్తున్నాము. అది మేము ప్రభుత్వానికిజేసే అదనపు పని, ఉపకారం, అదనపు సేవ. దానిని గుర్తించి మాకు కావలసిన సహకారం చేయకుండా మేము డబ్బును కాజేయడమే ప్రధానంగా పెట్టుకొన్నామనే ఉద్దేశ్యంతో మా మీద శిక్షలు వేయడానికి వస్తే ఇదేమి న్యాయమని" వర్తకులంతా వ్యతిరేకిం చారు, అట్లా చేసినప్పుడు Sales Tax విషయంలో ఉద్యోగస్తులలో చాలా అవినీతి ఉన్నదని కమ్యూనిస్టుల దృక్పథం. ఆ అవినీతి నూటికి 70 ఉన్నదో, 50 ఉందో, 30 ఉందో అనే అంచనా చెప్పడం కష్టం, కాని వర్తకులంతా ఈ టాక్సును తప్పించుకోడానికి చూస్తున్నారు. వారికి ఆదాయం వస్తుందని చేస్తున్నారా అని అంటే లేదు. కాని వర్తకులు సహకారం చేస్తున్నారు. చిన్న వర్తకులలోని ఎక్కువమందిమీద పెత్తనం చలాయించకుండా Harassment ను తగ్గించడానికి కూడా మార్గం చూడాలనుకున్నాము.

తప్పుడు లెక్కలు పెట్టి పెద్దమొత్తాలు ప్రభుత్వానికి చెల్లించకుండా తప్పించుకునే పెద్దమనుష్యులను — వారి అందరినీ—శిక్షించినట్లయితే లాభం లేదు. Prohibition cases వలెనే Sales Tax విషయంకూడా వస్తే ఉపయో గంలేదు. అందువల్ల ప్రతి చిన్నవానిని జైలులోపెట్టి లాభంలేదు. ఈ రీతిగా 2, 10, 20 వేల రు. ల పన్నును ఎగవేసే పెద్దమనుష్యులను-వారిని 40 వేలో 50 వేలో కట్టమంటే కట్టివేస్తారు. 10 ఏండ్లకు ఒక పర్యాయం పట్టుకుంటారు. 10 ఏండ్ల లోపున మళ్లా సంపాదించుకోవచ్చును అనే ధైర్యంతో కట్టి పారే స్తారు. అటువంటివారికి 6, నెలలో, 3నెలలో శిక్ష ప్రధానం కాదు.

అ తి నీ తి క ర ం గా పనిచేసే వారిని ప్రజలు అసహ్యించుకొనే టట్లుగా కోర్టులకు తీసుకొనివచ్చి శిక్షలు వేయాలి. ఈ సూత్రాన్ని కమ్యూ

నిస్తు ప్రభుత్వం బలపరిచింది. ఈనాడు కూడా దానిని బలపరచడానికితయారుగా ఉన్నాము.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- పెద్దవారి మీదనా ?

శ్రీ పి. సుందరయ్య :- పెద్దవాళ్ల మీద అనే నేను చెప్పేది. పెద్దవాళ్లను వదలి వారిని రెండువేల రూపాయలు జరిమానా కట్టుకోవలసిందని చెప్పి, కిళ్లీ దుకాణాల వాళ్లను ఉల్లిపాయల దుకాణాల వాళ్లను బంగాళాదుంపలు అమ్ముకునే వాళ్లను ఈ విధంగా రు 7,500లు వరకు అమ్ముకునే వారిని జైళ్లకు పంపే పద్ధతిని కమ్యూనిష్టుపార్టీ ఒప్పుకోదు. ప్రజల దగ్గరనుంచి డబ్బు వసూలు చేసి విపరీతంగా లాభాలు సంపాదించి ప్రభుత్వానికి కట్టకుండా ఏ కొద్దిమందో ఉంటే వారికి moral గాను సాంఘికంగాను అది అవినీతి అని తెలియడానికి ఇతర వర్తకులు అసహ్యించుకొనడానికి మార్గంగా కూడా ఈ జైలు శిక్ష అనేది మేము సూచించాము. ఎక్కువమంది వర్తకులు అవినీతి పరులు కారని ఎక్కువమంది నీతిపరులే అని న్యాయం చేయాలని అనుకునే వారే అని, ప్రభుత్వానికి సహకారం చేయాలని ఉద్దేశం ఉన్నవారే అని మేము భావించాము. ఎవరో కొద్దిమంది మాత్రం తమ స్వలాభంకోసము అనేక రీతులుగా దుర్వినియోగం చేస్తూ డబ్బు కాజేయడానికి చూస్తుంటే వారికి నీతి చెప్పడానికి ఇతర వర్తకుల సహకారం తీసుకోడానికి ఇతర ప్రజల సహకారం కూడా తీసుకోడానికి అటువంటి వారిపై మాత్రమే శిక్ష విధించడానికి మేము అంగీకరించాము. దానికైనా ఎన్నో నిబంధనలు పెట్టాము. అటువంటి జైలు శిక్ష మొదటి దఫా తప్పుకు లేదు. మొదటిదఫా తప్పుడు లెక్కలు వ్రాసినట్లుంటే మామూలు అపరాధమే విధించాలి; జైలు శిక్ష లేదు. రెండవ దఫా తప్పుడు లెక్కలువ్రాస్తే కోర్టులోపెట్టి ఋజువుచేసి శిక్ష వేయాలని చెప్పాము. అటువంటి పరిస్థితులలో శిక్ష తప్ప అపరాధం లేదు. ఆరునెలల వరకు అని చెప్పాము అనుకోండి. ఏదో minimun period prescribe చేయండి శిక్ష నుంచి మాత్రం escape లేదు, మొదటి దఫా తప్పుడు లెక్కలువేస్తే అపరాధంతో సరిపోతుంది. రెండవసారి మాత్రం పెద్దవారిని నలుగురిని పట్టుకుని జైళ్లలో వేస్తే చిన్నవాళ్లుకూడా ఇది తప్పని తెలుసుకుంటారు. పెద్దవాళ్లు చేస్తున్నారు కాబట్టి మనం చేస్తే తప్పుఏమిటి ? అని అనుకోకుండా పెద్దవారిని నలుగురిని పట్టుకుని ఆ విధంగా చేయగలిగితే అప్పుడు example గా ఉంటుంది - deterrent గా కూడా ఉంటుంది - అని మేము చెప్పాము. ఆదర్శప్రాయంగా ఉంటుందనే మేము చెప్పాము. అమ్మకం పన్ను చట్టంలోని ఏ రూల్సును ఎవరైనా ధిక్కరించినా ఆరు నెలలు శిక్ష వేయవచ్చును; రెండువేల

రూపాయలు జరిమానా వేయవచ్చునని a, b, c, d, e, f, g, అంటూ క్లాజులు draft billలో పెట్టారు. ఎందుకు పెట్టారంటే వెనుకటి ఆంధ్ర సవరణచట్టంలో ఉన్నది కాబట్టి పెట్టాము అన్నారు, ఆంధ్ర అమ్మకం పన్ను విచారణసంఘం వారు నాలుగు నెలలుప్రభుత్వం డబ్బుతో తిరిగి తిరిగి రిపోర్టు వ్రాశారు, వారు ఏకగ్రీవంగా చేసిన ప్రతి నిర్ణయాన్ని త్రోసిపారవేసి ప్రతిదానికి శిక్ష వేయడానికి ఎవరూ ఒప్పుకోరు. ఆ రీతిగా తయారైన చట్టంలో ఉన్నదానిని ఉన్నట్లు ఇక్కడ పెట్టారు. ఈ గొడవ అంతా మేము చెబితే కొన్ని మార్పులు చేశారు, ఏమిటి ఆ మార్పులు? శిక్ష వేయడమనేదానిలో మార్పులేదు. Clauses, (b), (d), (e), (f), విషయంలో మాత్రం శిక్ష ఉంటుంది; మిగిలిన వాటికి లేకుండా తీసిపారేశారు. Clauses (a), (c), (g) లకు జరిమానా మాత్రమే ఉంటుంది. ఉద్యోగస్థులు తప్పుడు లెక్కలుకట్టి కావాలని ఉద్దేశపూర్వకంగా ప్రభుత్వానికి పన్ను ఎగవేయాలని చూస్తున్నారని శిక్ష వేయించవచ్చును. ఉద్యోగస్థులు సోదా చేయాలని కాని పుస్తకాలు స్వాధీనం చేయాలని కాని వెళ్ళినపుడు అడ్డువస్తే అప్పుడు కూడా శిక్ష వేయించవచ్చును. వీటికి తప్ప మిగిలినవాటికి శిక్ష లేదని చెప్పారు. సెలక్టు కమిటీలో ఈ క్లాజుల విషయమై కొంత మార్పు చేసిన తరువాత కూడా ఏమి ఉన్నది? తప్పుడు లెక్కలు వ్రాస్తున్నారనే పేరుతో ప్రతి చిన్నవానిమీదకు కూడా వెళ్ళవచ్చును. నిజానికి శిక్ష వేయడం ప్రధానం కాదు. వర్తకుల సహకారం తీసుకోడం ప్రధానం. ఇటువంటి సహకారం లక్షలు, కోట్లు రూపాయిలు వ్యాపారం చేసేవారు కొంతమంది ఉద్యోగస్థులను లోబరుచుకు రాకుండా చేస్తున్నారు. వారికి పారం చెబితే మిగిలినవారు సక్రమంగా ఉంటారు. చిన్న వర్తకులు సహకారం ఇస్తారనే పునాదిమీద మేము వెడితే అందరిమీద శిక్ష వేస్తామనే రీతిగా చట్టం తయారైనది, అమ్మకం పన్ను విచారణ సంఘం వారు ఈ క్లాజుల క్రింద prosecution చేసే అధికారం ఎవరికి ఇచ్చారు? Commissioner of Income Tax కు మాత్రమే ఆ అధికారం ఇచ్చారు, ఈ సూచననుకూడా త్రోసిపారవేసినారు, ఈ విషయమై సెలక్టు కమిటీలో వాదించిన తరువాతకూడా శిక్షల క్లాజులు చాలా విస్తృతంగా ఉన్నాయి. అందరిమీద శిక్షలు వేయవచ్చును. Obstruction గలిగిస్తే శిక్ష వేయించవచ్చును. Obstruction అంటే ఏమిటి? 'ఉండవయ్యా, మా వాళ్ళు కొంచెం మడి కట్టుకుంటున్నారు; కొంచెం ఆగు' అంటే obstruction అవుతుంది. నావి న్యాయమైనలెక్కలు; ఎందుకుతీసుకువెళ్ళుతున్నావు అంటేObstruction అవుతుంది. విశాల ప్రపంచం ఎంత విస్తృతంగా ఉన్నదో Obstruction అంటే అన్ని విశాలమైన అర్థాలు తీయవచ్చును. బలవంతంగా లెక్కలు

తీసుకోనివ్వకుండా అపు చేశాడు, Physical violence involve అయిన దంటే obstruction చేశారు అనుకోవచ్చును, ఏమీలేకపోతే Obstruction చేశారు అంటారు; తాళాలు వేస్తే obstruction అంటారు. ఈ రకంగా అనేకం ఉంటాయి.

"fails to pay within the time allowed, any tax assessed on him or any penalty levied, or any fee due from him" అని ఒక క్లాజు పెట్టారు. దీని క్రింద అన్ని రకాల వారిని శిక్షించ వచ్చును. రిజిస్ట్రేషన్ ఫీజుకాని, అపరాధంకాని, పన్నుకాని, ఏది చెల్లించక పోయినా శిక్షించవచ్చును. శిక్షవేయడమే ప్రధానంగా కనిపిస్తోంది, Or a fine అంటూ ఒక discretionary clause పెట్టారు. అంటే మెజిస్ట్రేటు చిన్నవారికి జైలు శిక్ష వేసి పెద్దవాళ్ళపై అపరాధం వేయవచ్చును. ఈ రకమైన option ఎందుకు ఇచ్చారు? జైలు శిక్ష అనేది special cases లో అవినీతి పరులైన వారికి బుద్ధిచెప్పడానికి, వారంటే ఇతర వర్తకులు, ప్రజలు కూడా అసహ్యించు కొనడానికి వీలుగా ఉండాలనే సూత్రాన్ని త్రోసివేసి అందరు తప్పుచేసే వాళ్ళే, అందరినీ ఒకే రకంగా చూడాలనే ధోరణి ఇందులో కనిపిస్తోంది, ఉన్న నేరాలు, ఉన్న శిక్షలు చాలక ఇంకా క్రొత్త నేరాలు తయారు చేయడానికి మేము సిద్ధంగా లేము, ప్రొహిబిషన్ కేసులతో ఇప్పటికే జైళ్ళన్నీ నింపాము, ఇప్పుడు అమ్మకం పన్ను నేరాలు అంటూ క్రొత్త నేరాలు తయారుచేసి జైళ్లు నింపడానికి మేము తయారుగా లేము. అమ్మకం పన్ను విచారణ సంఘంవారి ముందు Commissioner of Commercial Taxes ఈ నేరాలక్రింద prosecution launch చెయాలని మేము సూచించడంలో ఉద్దేశం ఏమిటి? అతడు పెద్ద అధికారి; చిన్న చిన్న కేసులన్నింటికి prosecution sanction చేయడం; ఏ నలుగురైదుగురు పెద్దవారిమీదనో sanction చేస్తాడు — ఇది మా ఉద్దేశం. 1956 లో వచ్చిన సవరణ చట్టంలో దీనిని బుట్టదాఖలు చేశారు. ఈ సారి సెలక్టు కమిటీలో దెబ్బలాడితే ఆఖరుకు Commissioner of Commercial Taxes బదులు Commercial Tax Officer అని పెట్టినారు, Commissioner of Commercial Taxes ఎక్కడ? Commercial Tax Officer ఎక్కడ? జిల్లాకు ఒకరో ఇద్దరో Commercial Tax Officers ఉంటే వారికి ఈ prosecution ను launch చేసే అధికారం ఇస్తారన్నమాట. అమ్మకం పన్ను విచారణ సంఘంవారు చెప్పిన సూత్రాలకు అభిప్రాయాలకు పూర్తిగా భిన్నంగా ఉన్నది ఇదంతా. వర్తకుల సహకారం మాకు అవసరం లేదు; ప్రజల సహకారం మాకు అవసరం లేదు; మా సిబ్బంది మాకు ఉన్నారు; వారికి ఎక్కువ అధికారాలు ఇస్తే మేము ఇంకా

ఎక్కువ వసూలు చేయగలము; అందుచేత Commercial Tax Officers కు ఎక్కువ అధికారాలు ఇస్తాము, చిన్న వర్తకుల మీద పెద్దవర్తకుల మీద prosecution launch చేస్తాము అనే ధోరణిలో ఉన్నది ఈ బిల్లు అంతా. అందరూ ఒకటే, అందరిమీద, శిక్షలు వేస్తాము అనే రీతిని penal clauses పెట్టడం క్రొత్త నేరాలను తయారు చేయడానికి, ఉద్యోగులు వర్తకులను మరి కొంత అల్లరిచెయ్యడానికీ సదుపాయాలు కల్పించడం తప్ప మరొకటి కాదు. ఎవరో కొద్దిమంది అవినీతిపరులను శిక్షించి—అదైనా రెండవ పర్యాయం అయితేనే—ఒక ఆదర్శంగా ఉండడానికి penal clauses పెడితే తప్ప, ఈ రకంగా ఉన్నప్పుడు దీనికి మేము వ్యతిరేకించవలసియున్నది; మేము సవరణలు ఇవ్వవలసిఉంటుంది. తరువాత ఈ ప్రధానాంశముల క్రింద యీ బిల్లులో points తీసుకోవలసి వుంటుంది—పన్ను రేట్లు, penal provisions. తరువాత నిర్వచనములలో casual dealer అని వున్నది. Casual dealer మీద యింతవరకూ పన్ను లేదు. ఇప్పుడు కొత్తగా తెలంగాణాలో వుందని చెప్పారు. తెలంగాణాలో ప్రజలకు వ్యతిరేకమైనవి, ఆంధ్రలో ప్రజలకు వ్యతిరేకమయినవి పొందుపరచడంలో department యొక్క గొప్పతనం, మంత్రివర్గం యొక్క గొప్పతనం.......

డాక్టర్ బి. గోపాలరెడ్డి :- అదయినా చేశారు కదా?

శ్రీ పి. సుందరయ్య :—అది చేశారని వారుసంతోషిస్తున్నారు. మేమువిచారిస్తున్నాము. అంతకన్నా ఏమీలేదు. ఇది casual dealer క్రింద వచ్చినప్పుడు దీనికొక నిర్వచనం (defenition) యిచ్చారు. ఇంకో క్లాజులో hawkers మీద register చేసుకోనవసరంలేదని వున్నది. Casual dealer కు hawker కు మధ్యగల సంబంధం చూడండి. 'ఈ hawker ను casual dealer క్రిందకు తీసుకు వచ్చి కొంపముంచివేయవద్దని' చెబితే, ఆలోచిస్తాం అన్నారు. ఏమి ఆలోచించారో సెలెక్టు కమిటీ నివేదికలో ఎక్కడా కనపడలేదు. ఏ రూల్సు క్రిందకి వస్తుందో కనపడలేదు. Casual dealer గురించి చిత్తుబిల్లులో ఎట్లా వుందో యిప్పుడూ అట్లానేవున్నది. ఎవరంటే వాళ్ళపైన పన్ను వేయడానికి వీలుంటుంది. అయిదువందలు, రెండు వందలు, మూడు వందల రూపాయల వస్తువులను అమ్ముకునేవాడుకూడా పన్ను కట్టాల్సి వస్తుంది. ఈ casual dealer కి limit పెట్టడం అవసరం. Hawker అయితే casual dealer క్రిందకు రాడు, Casual dealer అయితే hawker క్రిందకు రాడు అని వుండాలి. కొద్ది పాటి సామాన్లు బండిలో వేసుకొని అమ్మవచ్చును. హైదరాబాదులో సీతాఫలాలు బండ్లలో తెచ్చి అమ్ముతారు. వాటిపైన 200 లేక 300 రూపాయల కంటే రాదు. వండ్లమీద tax లేదు. ఈ మూడు వందల అమ్మకమునకు పన్ను వేయాల్సినదేనా?

అందుచేత casual dealer కు limit పెట్టాల్సిన అవసరంవున్నది. మామూలు hawkers, brokers దీని క్రిందకురారని సవరణ చేయాలి. అవి చేయక పోతే casual dealer వల్ల ప్రభుత్వానికి ఎక్కువ ఆదాయము రాదుగాని ప్రభుత్వోద్యోగులు వారిని పీడించి డబ్బు సంపాదించడానికి మాత్రం బాగా వుపయోగపడుతుంది, వారు కొంత డబ్బు కడితే కడతారు, లేకపోతేలేదు. ఈ పన్నులనే చేపలను పట్టడానికి విస్తృతంగా వలవేసి, మాటలకు దీర్ఘ నిర్వచనాలిచ్చి, కొన వరకూ లాగితే యీ వల చిరిగిపోయి చాలామంది తప్పుకుపోవడానికి ఉపయోగపడుతుంది. అందుచేత యీ విషయంలో చాలా మార్పులు చేయవలసివుంటుంది. అసలు సూత్రాలే తప్పు సూత్రాలు. ఆ సూత్రాలలో కూడా సామాన్య ప్రజలకు, మామూలు చిన్న చిన్న వర్తకులకు నష్టం రాకుండా ప్రభుత్వం చేయాలి. దాని కోసం single point మొదటి purchase, sale tax ల మీద పెద్ద dealers నుంచి ఖచ్చితంగా పన్ను వసూలు చేయడానికి అధికారాలు మేము యిస్తాం అన్నాం; ఎందుకంటే, వాళ్ళకు దెబ్బలాడే శక్తి వుంది కనుక. కాని నోరులేని సామాన్య వర్తకుల మీద ఈ రకంగా పన్నులు వేసే అధికారం యివ్వలేమని పదే పదే చెప్పి నాము, మరల చెబుతున్నాను. అందుచేత జాగ్రత్తగా ఆలోచించండి. ఈ general discussion లోనే జాగ్రత్తగా ఆలోచించండని చెబుతున్నాను. ఏదో కమ్యూనిస్టులు చెప్పారుకదా, ప్రతిపక్షాలవారిపని తిట్టడమేనని ఉపేక్షించ రాదు వర్తకులు తిప్పించుకోడానికి ఎన్నో మాటలు చెబుతారు. వాళ్ళమాట లకు విలువేముంది. మేమే సర్వజ్ఞులం, అనే ధోరణిలో పోవడం సరియైన పద్ధతికాదు Sales Tax Enquiry Commission లో ప్రతిపక్షాల ఎవరినైన ఒకరిని వేసినప్పటికీ - ఆ విధంగా ఒకరినైనా వేసినందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను - ఎందుకని అంగీకరించాము ? ఈ బిల్లునంతా పూర్తిగా మార్చివేయగలమని మేము అంగీకరించామా ? లేదు. ప్రభుత్వ ఆదాయం తగ్గకుండా, సామాన్య వర్తకులకు నష్టంలేని రీతిగా సూచనలు చేయడానికి సహా కరించాలని కమిటీలో సభ్యత్వాన్ని అంగీకరించాము. నా ఆరోగ్యం బాగులేక పోయినా ప్రతి meeting లో చర్చించి వర్తకుల ప్రతినిధులు, Department ప్రతినిధులు కాంగ్రెసు ప్రతినిధులు అందరూ ఏకగ్రీవంగా అంగీకరించిన సూచనలేచేశాము. వాటినైనా ఆలోచించండి. ఈ బిల్లును మా కమ్యూనిష్టు దృక్ప థంలోకి మార్చాలనే ఉద్దేశం లేదు. మేమిచ్చిన మంచి సూచనలన్నీ బుట్టదాఖలు చేసి పాత వైఖరి అవలంబించి, ప్రభుత్వం మేమే సర్వజ్ఞులమని భావిస్తూ పన్నులు ఎక్కువచేయాలి, పన్నులు ఎక్కువచేయాలి, పన్నులు ఎక్కువ చేయాలి సహకరించండి అని చెబితే సహకారానికికూడా కొంత పరిమితి

వున్నవని గుర్తుకు తీసుకురావాలి. సహకారం పేరుతో చిన్న వర్తకులను వేపించుకొని తినడానికి ప్రభుత్వం చట్టాలు తెస్తుంటే దానికి చేసే సహకారం ప్రజలకు అపచారం అవుతుంది. అందుచేత యింతగా time తీసుకుని నిర్మొగమాటంగా చెప్పవలసివచ్చింది. ప్రతిపక్షం చెప్పారని, కమ్యూనిస్టులు చెప్పారనే దృష్టితోకాకుండా చేసిన మంచి సూచనలను సాకల్యంగా ఆలోచించి వాటికివ్వవలసిన విలువనిచ్చి సవరణలు ఆమోదించాలి. ప్రభుత్వ ఆదాయానికి నష్టంరాకుండా చిన్న వర్తకులు, కాంగ్రెసు ప్రతినిధులు చేసిన సూచనలనైనా మనస్సులో పెట్టుకోకుండా త్రోసివేస్తే యిది నిరుపయోగమవుతుంది. అందుచేత యిటువంటి పన్నుబిల్లు విషయంలో ప్రభుత్వం జాగ్రత్తగా ఆలోచించాలి. ఆవిధంగా ఆలోచించి తీసుకురావాలిగాని "మాకు మెజారిటీ వున్నది కాబట్టి మీరు మాకు ఏమీ చెప్పనవసరంలేదు, మా యిష్టం వచ్చినది చేస్తాం" అంటే దీనివల్ల దేశం ముందుకుపోదు. జరిగేది జరుగుతూ వుంటుంది. అధ్యక్షా, మీరుచెప్పిన ప్రకారం సరిగా గంట అయిపోయినది. కాబట్టి కూర్చుంటున్నాను.

మిస్టర్ స్పీకర్ :- General discussion రేపుకూడా జరుగుతుంది. ఇవ్వాళ ఒక్కొక్క గౌరవసభ్యునికి 15 నిముషాల చొప్పున మాట్లాడడానికి కాలపరిమితి పెడుతున్నాను. రేపు పదినిముషాలే వుంటుంది. పార్టీ నాయకులకు అవసరాన్నిబట్టి అదనపు గడువు యివ్వబడుతుంది.

*శ్రీ టి. జాలయ్య (గుంటూరు. నెం. 1.):- అధ్యక్షా, ఈ Sales Tax Bill మీద మాట్లాడడానికి నాకుకూడా అవకాశం యిచ్చినందుకు ముందుగా తమరిని అభినందిస్తున్నాను. ఈ Sales Tax Bill ను తయారుచేసి ఆంధ్రకు, తెలంగాణాకు ఏకంగా ఒకేవిధంగా ఉండేలాగున పన్నువేయాలని ఒక special officer ను నియమించి ఒకేవిధమైన bill తయారుచేయించినందుకు ప్రభుత్వమును అభినందించవలసియున్నది. ఎందుకంటే ఒకే State లో రెండు విధాల పన్నులుంటే వర్తకులు దెబ్బతినడమే గాక ప్రభుత్వానికి రావలసిన పన్ను లెక్కలుకట్టి చెల్లించడానికి అవకాశం వుండదు. అందుచేత ముందుగా ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. అందులో చాలా అనుభవం గల శ్రీ సాంబమూర్తిగారిని special officer గా యీ పనికి నియమించడంలో ప్రభుత్వం చాలా తెలివిగల పని చేసినదని చెప్పుచున్నాను. ఈ బిల్లులో పూర్ణంగా అంశాలు యావత్తు చదివి అర్థం చేసుకుని శ్రీ సుందరయ్యగారు విపులంగా స్పష్టంగా వారియొక్క సందేశమును అందజేసినారని చెప్పక తప్పదు. ఐతే ముఖ్యంగా 1939 సంవత్సరం Sales Tax Bill వచ్చినప్పటినుంచీ యీ తేదీ వరకూ ప్రతి అంశంకూడా అర్థం చేసుకుని నా

వర్తకం చేసుకుంటున్నానని నేను గట్టిగా చెప్పగలను. ఐతే కొన్ని కొన్ని కారణాలవల్ల అప్పుడప్పుడు బిల్లును మార్చివేస్తూ ప్రభుత్వంవారి అవసరాన్ని బట్టి, డబ్బు తొందరనుబట్టి వర్తకులమీద ఏమయినా పెట్టుటకు యిష్టపడి మొట్టమొదట వుద్దేశించిన యీ బిల్లులో ఎన్నియో మార్పులు తెచ్చి ఒబ్బిబ్బులు చేశారని చెప్పకతప్పదు. డబ్బు అవసరం వచ్చినప్పుడు ఏదో సృష్టించేదీ, ఏదో రేటు పెంచేదీ, వర్తకుని యిమిచ్చేది, ఆ విధంగా బిల్లును మార్పులు చేసుకుంటూ డబ్బు రావడమే ప్రధానమని చూశారుగాని యీ బిల్లులోని లోపాలు సవరించాలని ప్రభుత్వం ఎప్పుడూ గట్టిగా పని చేయలేదని చెప్పకతప్పదు. గోపాలరెడ్డిగారు మద్రాసులో వుండగా sales tax కామధేనువు అన్నారు. ఆ కామధేనువుకు నీరు పెట్టక. వసతి చూపించక, అవసరమైతే కంచీతో రెండు చురకలు వేయటానికి ప్రయత్నించారని వర్తకులు చెప్పక తప్పదు. అందుచేత వర్తకుడు అందరికు మించిన అయినాడని వర్తకుల తరఫున నేను గట్టిగా చెప్పుచున్నాను. వర్తకుడు తప్పుచేసి, పన్నులు ఎగగొట్టే లెక్కలు తయారు చేసినపుడు ఆ వర్తకుడు నజరానాల క్రింద, లంచముల క్రింద ఆ పుస్తకములలో ఖర్చు వ్రాసినట్లుగా కనపడదు. వేయి రూపాయలు పన్ను ఎగగొట్టే వర్తకుడు ఈరీతిగా రు. 500-0-0 అయినా ఖర్చు పెడతాడు. Turnover చేస్తున్నాం తప్ప ఈ ఖర్చులు వుంటాయా అని విచారించే నాధుడు కన్పించటంలేదు. ఎన్నోసార్లు గవర్నమెంటుకు వ్రాసుకొన్నాను, చెప్పుకొన్నాను. ఈ ఖర్చులు వున్నాయా ? లేవా మాడమని ఆఫీసరుతో చెప్పినా అతడు వ్రాసినట్లులేదని నా అనుభవమువల్ల చెబుతున్నాను. తన ఆఫీసరు చేయబోయే దుండగములను తను కాపాడుతున్నారు. వ్యాపారుల మీద నిందమోపి,ధనం రాబట్టుకొనే ఉద్దేశ్యం గవర్నమెంటుకు వుంది. గవర్నమెంటు ఎడ్మినిస్ట్రేషనుకు డబ్బు అవసరమే. మేముకూడా ఎక్కువడబ్బు వసూలుచేస్తాం అనేవాళ్ళలో నేను ఒకడిని. వ్యాపారులు తప్పు చేస్తున్నారా? అంటే చెయటంలేదు. వ్యాపారుల సహకారంతో వసూలుచేస్తే 8 కోట్లకు 15 కోట్లు వసూలు అవుతుందని గట్టిగా చెబుతున్నాను. వర్తకుడు తప్పు చేస్తున్నాడని అనుకోవద్దని Finance Minister గారికి చెప్పాను. మేము ఎగగొట్టుతున్నామని వర్తకులు చెప్పినట్లు సుందరయ్యగారు చెప్పారు. వారు వినటం పొరబాటు. మేముచెప్పింది వసూలుచేసినవాడు కడుతున్నాడని, వసూలు చేయనివాడు కట్టడంలేదని. వసూలు చేయలేదనే నింద వ్యాపారస్థులపై వేయవద్దని వారి రిప్రజెంటేటివ్ కమిటీ ఎదుట చెప్పాడుగాని ఎగవేస్తున్నామని చెప్పలేదు. Income Tax బాధవల్ల రెండుపుస్తకాలు ఏర్పరచామని వారితో చెప్పలేదని నేను చెప్పుతున్నాను. వ్యాపారస్థులసంఘం చేసిన

తీర్మానములోగాని, సాక్ష్యములోగాని "వసూలుచేస్తే కడుతున్నాము. వసూలు చేయకపోతే కట్టడంలేదు" అనేవుంది. దానికి మమ్ములను బాధించవద్దు. దానికి మమ్ములను compel చేయవద్దు అని వ్యాపారులు గట్టిగా చెప్పడానికి సిద్ధంగా వున్నారు. గవర్నమెంటు వ్యాపారులకు రక్షణ కల్గించకుండా పెడదోవన పెడితే వసూలు చేయము, కట్టము. గవర్నమెంటు వారికికావలసిన రక్షణయిస్తే గవర్నమెంటు ఏజెంటుగా వసూలుచేసి గవర్నమెంటు బొక్కసము నింపడానికి సిద్ధంగా వుంటారని వ్యాపారుల తరఫున నేను గవర్నమెంటుకు హామీ ఇస్తున్నాను. అయితే వ్యాపారస్థుడుకూడా నీతిపరుడు, విజ్ఞానవంతుడు, తెలివి గలవాడు. ప్రభుత్వ యంత్రాంగములో ఒకడని గ్రహించితేనేతప్ప అతడు సహకారము చేయడనే నేను మంత్రివర్గానికి గట్టిగా చెప్పుచున్నాను. సహజముగా ఒక పన్నువేస్తే డిప్యూటీ కమీషనరు తగ్గించలేదు. ట్రిబ్యునల్ తగ్గించింది. రెండో సంవత్సరంకూడా డిప్యూటీ కమీషనర్ అదే పన్ను వేశాడు. (ట్రిబ్యునల్ తగ్గించింది.) ఈ విధంగా వ్యాపారస్థుడు కోర్టు చుట్టూ తిరగడము. అప్పీలు చేయటములోనే సరిపోతోంది. కమర్షియల్ టాక్సు ఆఫీసరుకు administration ను ఈ విధంగా నడపమని తెల్పే డిపార్టు మెంటు లేదు. మంత్రిగారి చెవిదాకా ఇవన్నీ రావనుకోండి. వ్యాపారులకు కష్టం తప్పదు. అప్పుడు ఏమిచేస్తాడు ? పద్దులువ్రాయకుండా ఎగగొడతాడు. తప్పదు. వ్యాపారస్థుడు తప్పు చేయాలని చేయడు. సహనంతో పూరుకుం టాడుగాని వసూలుచెయ్యడు. గవర్నమెంటుకు డబ్బులేదు. ఆఫీసర్లయందు కూడా గవర్నమెంటుకు న్యాయదృష్టిలేదు. జిల్లాకు ఒక ఆఫీసరునువేసినా, ఆయనకు బండి వుండదు. ఎక్కడనుండి వసూలుచేస్తాడు ? లారీమీద సరుకు పోతుంటే చూస్తూ పూరుకుంటాడు. జిల్లాకు ఒకలారీ ఇవ్వండి. రెండులక్షలు ఖర్చవుతాయి. లారీపైవెళ్ళి పట్టుకొని డబ్బు వసూలుచేస్తాడని నేను 10 సార్లయినా గవర్నమెంటుకు చెప్పాను. Advisory Committee లో చెప్పాం. Select Committee లో చెప్పాం. ఉపన్యాసాలలో చెప్పాం. మా మాటలు మాకే వుంటున్నాయి. గవర్నమెంటుకు దానిమీద శ్రద్ధలేదు. ఆఫీసరు పనిజేసినా, తిరిగినా T. A. ఇవ్వరు. స్వయంగా మోటారుపై వెడితే పెట్రోలుఖర్చు. అందుచేత ఆఫీసులో కూర్చుని ఏదో వ్రాసి గవర్నమెంటుకు ఏదోవిధంగా డబ్బువచ్చే సదుపాయం జేస్తాడు. ఆఫీసరుకు గవర్నమెంటు తగిన మేలు చూపించటంలేదని అనుభవముమీద చెబుతున్నాను. నేను గుంటూరులో వున్నాను. గుంటూరులో sales tax ఎక్కువ వసూలు అవు తుంది. కృష్ణ first అనుకోండి. పొగాకు వచ్చినతరువాత గుంటూరే first అనుకోండి. ప్రతి ఆఫీసరుకు వసూలుచేయాలనే వుంటుంది. సైకిల్‌మీద

పోతామా ? బస్సుమీద పోతామా? ఏమీ చిక్కదని వారు ఆందోళన వెల్లడిస్తున్నారు. ఆఫీసరుకు తగిన conveyance ఇచ్చి జాగ్రత్తగా వసూలుచేసే విధానం అవలంబించమని కోరుతున్నాను. 1939లో multi point చేసినవారికి, 10వేల రు. పన్ను వేసినవారికి పన్ను లేదని అన్నారు. అప్పుడు బియ్యంబస్తా 9 రు వుండేది. ఈనాడు 35 రు. వుంది. ఆనాడు మినుములబస్తా 12 రు. వుంటే ఈనాడు 20 రు. వుంది. ఆవిధంగా 4 లక్షలు పెరిగింది. 10 వేల రు. పెట్టిన వర్తకుడు పన్ను 40 వేలకు పెంచితేనే ఆ తేడా సరిపోతుంది తప్ప 10 వేలను 7 వేలకు తగ్గిస్తే కేవలము అన్యాయము. వర్తకుడిని తప్పు త్రోవలో పెట్టడము. గవర్నమెంటు వ్యాపారస్తులను మంచి త్రోవలో పెట్టక తప్పుత్రోవలో పెట్టటానికి పునాదులు వేసింది. Multi point taxation లో మూడ్రమే 27 వేల రు.లకు పెంచి చిన్న చిన్న వ్యాపారులను కాపాడే బాధ్యత గవర్నమెంటుకు వుందని గట్టిగా చెబుతున్నాను. వ ర్త కు ల ప్ర తి ని ధి గా ఈనాడు సు ౦ ద ర య్య గా రు ఉ ప న్యా స ం ఇచ్చారు. అందుకు వారికి ఆంధ్ర ప్రదేశ్ వ్యాపారుల తరపున నేను అభినందనలు తెలియ జేస్తున్నాను. అయినా కొంచెంగా పెద్ద వ్యాపారులమీద ఒక బండ వేశారు. అదికూడా వేయకపోతే వారివారు వర్తకులకు అమ్ముడుపోయారు అని అంటారేమోనని ఆ బండవేశారు. 20 వేల రు. multi point మీద మిగతా విషయాలలో వ్యాపారులకు కావలసిన సదుపాయములు చేయాలి. వ్యాపారస్తుడు 10 వేల రు. turnover చేస్తే లక్ష రూపాయిలుగా చూపిస్తారు. దానిలో mistake చూపించి కలుపుకుంటే సిమాందు నోటీసు ఇస్తారు. పన్ను కడతారు. యింకో స్టేటుకు పంపించాలంటే లక్షరూపాయల సరుకు పంపిస్తున్నాము, దానికికూడా మీరు పన్ను వేయండని కూడా వ్రాస్తుంది. వెంటనే సిమాండు నోటీసు పంపించి వసూలు చేయమంటే వ్యాపారస్తుడు చెడిపోతాడు. C.T.O అప్పీలు తీసేయక D. C. O. తీసేస్తే, రెండు సంవత్సరములలో తిరిగి మళ్ళీ 'ఎ సె స్ మె ం ట్' వచ్చేటప్పటికి మళ్ళీ కలుపుతున్నారు. ఎసెస్మెంట్ వేసే విషయంలో వర్తకులకు కొన్ని అన్యాయాలు జరుగుతున్నాయి. వర్తకుడు ఒక లక్ష రూ. ల టర్నోవర్ వుందని చెబితే అధికారులు అంగీకరించరు. ఇంకొక లక్ష రూ. ల సరుకు లెక్కలు చూపకుండా యితర రాష్ట్రాలకు ఎగుమతి చేశాడని చెప్పి దానికికూడా పన్ను కట్టాలంటారు. దానికి వెంటనే డిమాండు నోటీసు పంపి, వసూలుచేస్తే వర్తకుడు తప్పకుండా చెడిపోతాడు. వర్తకుని యొక్క కష్ట సుఖాలనుకూడా గమనించాలి. ఎసెస్మెంట్ కు తగ్గట్లుగా ముందు వర్తకుడు పన్ను కట్టిన తరువాతనే అప్పీలు చేసుకోవలసియుంది. అపీలులో వర్తకుడు నెగ్గినా ఆ మొత్తాన్ని తిరిగి ఎసెస్

మెంటులో కలుపుతున్నారు. గత సంవత్సరం యితర రాష్ట్రాలకు సరుకు పంపారంటూ 130 కేసులు పెట్టారు. వాటిని ట్రిబ్యునల్‌వారు రివర్సు చేశారు. ఐనా తిరిగి ఆ మొత్తాలకు ఉద్యోగస్థులు ఏసెస్‌చేశారు. ఈ ఎసెస్‌మెంటు పైన తిరిగి డిప్యూటీ కమీషనర్‌గారి దగ్గర అపీలు చేయాలి. అపీలు చేసుకుంటే ఆడిటర్‌కు రెండు వందలు రు. యిచ్చుకోవాలి. ఇతర ఖర్చులు 400 రు. లు అవుతాయి. నిజానిజాలెలావున్నా డిప్యూటీ కమీషనర్ ఎసెస్‌మెంటును కన్ఫరం చేస్తారేగాని రద్దుపరచరు. దానిమీద ట్రిబ్యునలుకు అపీలు చేసుకోవాలి. దానికి మరల 1000 రు. లు ఖర్చు. వచ్చే లాభంకన్న ఖర్చు హెచ్చుగుతున్నది. జడ్జిమెంట్లనుకూడా చూడకుండా పన్ను విధిస్తుంటే వర్తకుడేమి చేయగలడు? ప్రభుత్వంవారు పెడుతున్న కష్టాలనుచూచి రోతపుడుతున్నదేగాని, ప్రేమ గలుగుటలేదు. ట్రిబ్యునల్‌యొక్క తీర్పులను గమనించవలెనని ఆఫీసర్లకు తాఖీదులు పంపగోరుతున్నాను. ఈ విషయంలో 3 మాసముల క్రిందట శ్రీ కళావెంకటరావు పంతులుగారికి చెప్పాము. వారు ఆలోచిస్తామన్నారు. శెక్రిటరీగారికికూడా యీ విషయాలు తెలియజేశాము. వారుకూడా ఆలోచిస్తామన్నారు. కాని యింతవరకు ఆర్డర్సు పంపించలేదు. ట్రిబ్యునల్సు యిచ్చిన తీర్పులకు సంబంధించిన మొత్తాలను తిరిగి ఎసెస్‌మెంటులో చేర్చవద్దని కోరుతున్నాను.

వర్తకులను శిక్షించడానికి వెనుకటి చట్టం ప్రకారం కమీషనర్‌గారికి అధికారంయిచ్చారు, కాని యీ బిల్లు ప్రకారం ఆ అధికారం సి. టి. ఒ. గారికి వుంటుంది. ఇది చాలా అన్యాయం. దీనిని వర్తకులమీద దయ అనవలెనో, లేక వర్తకుడు పనికిరానివాడని ప్రభుత్వమువారి అభిప్రాయమో బోధపడడం లేదు. సి. టి. ఒ. లకు యీ అధికారముయిస్తే బ్రతికే వర్తకుడెవడైనా వుంటాడా? ఎవడు దాసోహం కాకపోతే వాడినల్లా మాజిస్ట్రేటు కోర్టుకు పంపుతూవుంటే వర్తకుడి బ్రతుకేమికావాలి? ఆలోచించండి గుండెమీద చేయి పెట్టుకొని. కమీషనర్‌కే యీ అధికారం యివ్వవద్దని మొరపెట్టుకుంటూయుంటే సి. టి. ఒ. కు దానిని దఖలుపరచడం వర్తకుడంటే గవర్నమెంటుకు లెక్కలేకపోవడం ఎల్లనేనని చెప్పకతప్పదు, కనుక యీ విషయాన్ని ప్రభుత్వంవారు పునరాలోచించాలని కోరుతున్నాను. తప్పు చేసినవాడిని శిక్షించవద్దనను. కాని జైలుకు పంపే అధికారం సి. టి. ఒ. లకు యివ్వడం మంచిది కాదనుకుంటాను. ఆ అధికారం మంత్రుల కివ్వండి. లేదా గవర్నమెంటు శెక్రిటరీలకు యివ్వండి. ప్రభుత్వమువారి పర్మిషన్ లేనిదే సి. టి. ఒ.లు ప్రాసిక్యూట్ చేయించడం న్యాయంకాదు. ఈ అధికారం శెక్రిటరీలకు యిచ్చినట్లయితే న్యాయాన్యాయాలు విచారించి, అన్యాయస్థులకు

శిక్ష విధించడానికి అవకాశముంటుంది. దానిమీద అపీలు అక్కరలేదు. సి. టి. ఒ. కు యీ అధికారమిస్తే వర్తకులకు రక్షణయుండదు. గవర్నమెంటుకు, వర్తకులకు బాధలేకుండా యీ అధికారం గవర్నమెంటు శెక్రిటరీలకు యివ్వవలసినదని నేను కోరుతున్నాను.

మల్టీపాయింట్ పద్ధతి మన స్టేటులో వున్నంతవరకు వర్తకులు రంపగోతన౦గాని వర్తకుల కష్టాలుగాని పోవని నా అభిప్రాయం. ఎప్పుడైతే సింగిల్ పాయింట్ టాక్సు విధిస్తారో ఆనాడు గవర్నమెంటువారు బాగా చెక్ చేసి ఎక్కువ డబ్బు వసూలు చేసుకొనుటకు వీలుంటుంది. మల్టీపాయింట్ టాక్సు వేస్తే పదివేల ఉద్యోగస్థులను నియమించాలి. ఈ 10,000 మంది ఉద్యోగస్థులు ఒక లక్ష షాపులను చెక్ చేయగలరు. సింగిల్ పాయింట్ టాక్సు వేస్తే పన్ను కట్టవలసిన పెద్దవర్తకుల సంఖ్య తగ్గుతుంది. తక్కువమంది ఉద్యోగస్థులను నియమించి పని బాగాచేయించవచ్చు. ఇప్పుడు రాయలసీమ పర్చేజ్ టాక్సు విధించడంతో 673 రైసుమిల్లులను తనిఖీ చేస్తే సరిపోతుంది. ఇదివరకు పన్నువిధించవలసిన వర్తకులు 11 వేలమందివుంటే ఇప్పుడాసంఖ్య 700కు తగ్గిపోయింది. సింగిల్ పాయింట్ టాక్సు ఎంతజాస్తిగా విధిస్తే అంత త్వరగా అడ్మినిస్ట్రేషనను సరిచేసుకోవచ్చు. హెచ్చుగా డబ్బు వసూలు చేసుకోవచ్చు, వర్తకుల లెక్కలను బాగా పరిశీలించడానికి వీలవుతుందని నా ఉద్దేశం. ఐతే ఆర్థిక మంత్రిగారికి ఒక భయంవుంది. మల్టీపాయింట్ టాక్సు వేస్తే సరుకు ఒకచేయి దాటినా, రెండు చేతులుదాటినా ఎక్కడైనా, అక్కడ పన్ను చెల్లించవలసి వస్తుంది, కాని సింగల్ పాయింట్ టాక్సు వేస్తే సరుకు ఒకరిచేతిలోనే ఉంటే మొత్తం పన్నంతా పోతుందని వారి ఉద్దేశం. వారి వుద్దేశం నాకు 10 సం. లనుంచి తెలుసు. ఆ ఉద్దేశం మార్చుకోమని వర్తకుల తరఫున నేను వారిని వినయపూర్వకంగా కోరుతున్నాను. ఎగగొట్టేవాడు ఎప్పుడైనా ఎగగొడతాడు. నీతిగా వుండేవాడు ఎలాటి పరిస్థితుల్లోనైనా నీతిగా వుంటాడు. కాబట్టి సింగిల్ పాయింట్ టాక్సు అమలు పరచమని కోరుతున్నాను.

ఇప్పుడు మైకామీద, పొగాకుమీద పన్ను వేస్తున్నారు. మైకాను కొని ఎగుమతి చేసేవాళ్ళు పన్ను చెల్లించాలి. కాని స్వంతంగా త్రవ్వి ఎగుమతిచేసే దానికి పన్ను లేకపోవడంవల్ల మైకా వర్తకాన్ని కత్తితో నరకడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందనుకొనవలసివస్తుంది. స్వంతదారు మైకాను త్రవ్వి కొని ఎగుమతి చేసుకుంటే పన్నులేదు. కాని వర్తకుడు సరుకుకొని ఎగుమతి చేస్తే పన్నువుంది. అప్పుడు నాబోటివాని వర్తకం ఏలాసాగుతుంది, దానివల్ల పౌనుకు 4 అణాలు ఎగుమతి వెలలో తేడావస్తుంది.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :— ఎక్స్‌పోర్టు డ్యూటీక్రింద ఇండియా గవర్నమెంటు వారు పన్ను విధించవలసిందేగాని మాకు సంబంధంలేదు. స్వంతదారు ఎగుమతి చేయడం సేల్ కాదు. అందువల్ల దానిమీద పన్నులేదు.

శ్రీ టి. చాలయ్య:— గనితవ్వకొని సరుకు అక్కడే అమ్ముకొంటే పన్ను లేకుండా మినహాయించడం మంచిదే. కాని సముద్రాలను దాటించి ఎక్కడకో తరలించుకొనిపోయినా పన్ను లేదనడం సబబుగాలేదు. ఇది విపరీతమైన సంగతి. మారుబేరం వర్తకునికి చాలా నష్టంవస్తున్నది. ఇకపోతే పొగాకు ఎగుమతులపై పన్ను విధిస్తున్నారు. అందువల్ల ఎవరూ పొగాకు బేరంచేయడంలేదు. సేల్సుటాక్సు తగ్గిస్తేనేగాని బేరం చేయమంటున్నారు. ఈఏడు ఎంతో నష్టమొచ్చింది. ధాన్యం వ్యాపారం విషయంలోకూడా వర్తకులకు కొంత అన్యాయం జరుగుతోంది. వర్తకులు ఫస్ట్ పర్‌చేజ్ మిద పన్ను చెల్లించుకోవాలి. కాని నెల్లూరు జిల్లాలో ఒక కొత్తపద్ధతి వున్నది. ప్రతిరైతు ధాన్యాన్ని మిల్లుకు తీసుకవస్తాడు. దానిని మిల్‌చేయిస్తాడు. అక్కడనుండి ఆ బియ్యాన్ని ప్రక్కనవున్న రాష్ట్రానికి ఎగుమతిచేస్తాడు. అతడు పన్ను యివ్వనక్కరలేదు. కాని ధాన్యం కొనుక్కొని బియ్యం ఆడించి ఎగుమతిచేసే వర్తకుడు ఫస్ట్ పర్‌చేజ్ మీద పన్ను యివ్వాలి. పండించిన పంటను పండించినట్లుగా అమ్మితేనే పన్నులేదు. గాని పండించిన పంటను మార్పుచేసి అమ్ముకున్నా పన్ను లేదనడం మంచిదిగాదు. దానివల్ల బియ్యం వర్తకం యాపత్తూ దెబ్బతింటున్నది. స్వంత పంట అమ్ముకుంటే పన్ను లేకుండా మినహాయించవచ్చు. అయితే యిప్పుడున్న పద్ధతిని కొంత మార్పుచేయాలని, వస్తువును మార్చినప్పుడు పన్ను వేయాలని, వస్తువును మార్చనప్పుడు పన్నులేకుండా చేయాలని మనవి చేస్తున్నాను. ఇప్పుడున్న పద్ధతివల్ల నెల్లూరు జిల్లాలో ధాన్యం అమ్మకాలమీద పూర్తిగా పన్నురావడంలేదు. 100 కి 10 వంతులైనా రాదు.

అడ్వయిజరీ కమిటీలలో పెద్ద పెద్ద చదువులు చదువుకున్నవారిని అధికారంలో వున్నవారిని మెంబర్లుగా వేసుకుంటే వారు సరియైన సలహాలు యివ్వలేరు. వారిచ్చేవి డిగ్రీ సలహాలేతప్ప అనుభవంతో కూడుకున్న సలహాలు కావు. కాబట్టి మంచి అనుభంగల వర్తక ప్రముఖులనుకూడా యీ అడ్వయిజరీ కమిటీలలో వేసుకోవాలి. బి. ఏ., ఎం. ఏ., చదువుకున్నవారి సలహాలు అంత ఉపయోగించవు. లాభం సున్న.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:- నెల్లూరులో యీ సంపత్సరం 488 వేలు పర్‌చేజ్ టాక్సు క్రింద వచ్చింది.

శ్రీ టి. జాలయ్య :- ఎన్ని ఎకరాల వరిసాగువుంది, ఎంత పంట పండింది, మిగతా జిల్లాలలో ఎంతవసూలైంది? అనే విషయాలన్నీ చూచుకుంటే పన్ను సరిగా వసూలైందీ, లేనిదీ తెలుస్తుంది. అడ్వయిజరీ కమిటీలలో వర్తకులలో మంచి అనుభవంగల వారిని వేసుకుంటే వారు నిర్మాణాత్మకమైన సలహాలిస్తారు. ప్రభుత్వం పన్ను పోగొట్టుకోవలసిన అవసరముండదు. వర్తకులందరూ ప్రభుత్వానికి పన్ను సరిగా రాబట్టడానికి ప్రయత్నం చేస్తారని వర్తకుల తరపున హామీ యిస్తున్నాను. ఐతే జైలు శిక్షవిషయంలో మాత్రం అధికారులు సి. టి. ఒ. లకు బదులు గవర్నమెంటు శెక్రిటరీలకు మార్చమని కోరుతూ నాకు యీ అవకాశమిచ్చినందులకు అధ్యక్షులవారిని అభినందిస్తున్నాను.

శ్రీ ఎ. బి. నాగేశ్వరరావు (రాజమండ్రి) :- అధ్యక్షా. జనరల్ సేల్సుటాక్సు చట్టము ఆంధ్రరాష్ట్రంలో ఒకపద్ధతిని, హైద్రాబాద్ రాష్ట్రములో వేరొకపద్ధతి ఉండడమువల్ల రెంటిని కలిపి ఒకేచట్టంగా తీసుకొని రావాలనే అభిప్రాయంతో యీ బిల్లు ఉపపాదింపబడినది. ఆంధ్ర, హైదరాబాదు రాష్ట్రములలో ఉండిన చట్టములను ఏకీకరణ చేయడానికి, ఒకే పద్ధతిని పన్ను విధించడానికి ఈ బిల్లు ఉద్దేశించబడినది. కాని బిల్లులోని 5 వ సెక్షనులో రూపాయకు రెండు నయాపైసలు చొప్పున అమ్మకం పన్ను విధించాలని ఉంది. ఆంధ్రరాష్ట్రంలో ఉండిన చట్టములో నూటికి రూపాయి తొమ్మిదణాలు మాత్రమే పన్ను విధించాలని ఉండేది. నిన్న మొన్నటిదాకా, మద్రాసు రాష్ట్రంలో ఏమి చేయబడుతుండెడిదో దానినే సుమారుగా ఆంధ్రరాష్ట్రంలో కాపీ చేయడం జరుగుతూ ఉండేది. మదరాసు రాష్ట్రంలో ఇప్పుడుకూడా నూటికి రు. 1-9-0 చొప్పున మాత్రమే అమ్మకం పన్ను వసూలు చేయబడుతున్నది. బిల్లుయొక్క ఆబ్జెక్ట్సు అండ్ రీజన్సులో రాబడి ఎక్కువ చేయవలెననే అభిప్రాయం ప్రభుత్వానికి లేదు. కాబట్టి వెనుకటి విధంగానే 1 9/16 శాతము వరకే పన్ను విధించడం అవసరమని నా యొక్క సూచన.

టర్నోవరుయొక్క కనిష్ట ప్రమాణము 10 వేల రూపాయలు ఉండవలెనని ఆంధ్రరాష్ట్ర శాసనంలోఉన్నది. అయితే హైదరాబాదురాష్ట్రంలో రు. 7,500 మాత్రమే ఉన్నది. ఇప్పుడు రాష్ట్రమంతటా టర్నోవరు పరిమితి రు. 7,500 పైబడితేనే పన్నువిధించాలని చెబుతున్నారు. ఆవిధంగా కాకుండా నికరమైన టర్నోవరు 10 వేల రూపాయలు ఉంటేనే పన్ను విధించాలని నాయొక్క సూచన.

అపెలేట్ ట్రిబ్యునల్‌లో ఒకజిల్లా జడ్జిగారు, మరిద్దరు సభ్యులు ఉంటారని బిల్లులో వ్రాయబడిఉంది. ఇది ముఖ్యంగా వర్తకులకు సంబంధించింది కాదు.

కాబట్టి ఆ ఇద్దరు సభ్యులలో ఒకరు అనుభవం కలిగినటువంటి ఒక వణిక్ప్రముఖుని వేసినట్లయితే దీనిలోవచ్చే కష్టసుఖాలను గురించి సంప్రదించడానికి ప్రభుత్వానికి వీలవుతుంది. కాబట్టి ఒక వర్తక ప్రముఖుని అపెలెట్ ట్రిబ్యునల్‌లో వేయవలెననికూడా నాయొక్క సూచన.

తరువాత 12 వ సెక్షనులో dealers క్రింద expalnation ఇస్తూ hawker అంటే, 64 చ. అడుగులకు మించినటువంటి స్థలములో వ్యాపారం చేసుకొనేవాడు, without employing paid labour అని వ్రాసియున్నది. కాని, ఏ కిల్లీకొట్టో, ఏ సోడా కొట్టో పెట్టుకొన్నవాడు మంచినీళ్ళు తేవడానికి గాని, సీసాలు కడగడానికిగాని ఒక కూలి మనిషిని పెట్టుకొంటాడు. ఏ కారాకిళ్ళీలో అమ్ముతాడు కారాకిళ్ళీలు కావాలంటే, బరంపురంనుంచి కారామసాలా తేవాలి. అది ఇతర రాష్ట్రాలకు సంబంధించినది. ఒరిస్సా రాష్ట్రానికి సంబంధించినది. ఇతర రాష్ట్రాలకు సంబంధించినటువంటి articles తెచ్చినట్లయితే, అది దానిక్రింద చెల్లబడదు. కాబట్టి దానిని కొంచెం మార్పుచేయవలెనని కూడా నా సూచన. తరువాత hawker అనే defenition విషయంలో Brookbond కంపెనీవారు లేక Lipton కంపెనీవారు కొట్టు కొట్టు తిరిగి వాళ్ళయొక్క packets అమ్ముతున్నారు, గనుక వారుకూడా hawkers క్రింద వస్తారా, రారా అనే విషయంకూడా ఆలోచించవలసిందని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ముఖ్యంగా చాలామంది వర్తకులు ఈ పన్ను ఇవ్వడానికి బాధపడడంలేదు గాని, ఈ Officers చుట్టు ఆ కాగితాలు, పుస్తకాలు మోసుకొని తిరగలేక బాధ పడుతున్నారు. Appeals చేసినపుడుకూడా, Appellate Tribunal దగ్గర వాళ్ళు చెల్లించవలసింది 600 రూపాయలైతే, వాళ్ళకు అయ్యే ఖర్చు వెయ్యిరూపాయలుకూడా మించిన instances ఉన్నాయి. కనుక ఈ Appellate Tribunals నివ్వదలచుకొన్నట్లయితే, ఆయా జిల్లాలలోని ముఖ్య ట్టణాలలో కూర్చొని ఆ appeals ఫైసలు చేస్తే బాగుంటుంది, గాని ఎక్కడో కూర్చొని 4, 5 సార్లు వాళ్ళను పిలిపించడం భావ్యం కాదు, అని నా అభిప్రాయము. Number of times కాకుండా ఇంత time లోపల పరిష్కారం చేయాలని దాంట్లో ఏర్పాటుచేస్తే బాగుంటుందని నాయొక్క సూచన. తరువాత appeals చేసేటప్పుడు వాటన్నింటికి పెట్టిన వ్యవధి చాలా తక్కువ. ఆ వ్యవధి కొంచెం పొడిగిస్తే బాగుంటుందనికూడా నా సూచన. Tax అంతా పుచ్చుకున్న తరువాతనే appeals allow చేయాలని ఉన్నది. Select committee లో సగంభాగమైనాసరే కట్టితే appeal చేయవచ్చు అని చెప్పబడింది. కాని existing state of affairs ను బట్టి, ఒకవేళ ఏదైనా disputed turnover గనుక ఉన్నట్లయితే accepted

turnover మీద ఎంత పన్నుఉందో అంత వసూలు చేసి, అప్పీలు ఫైనలు అయినతరువాత ఆ disputed turnover మీదఉన్న tax వసూలు చేసే టట్లు ఏర్పాటుచేస్తే బాగుంటుంది. Accepted turnover మీద పన్నుగనుక pay చేసినట్లయితే appeal చేయవచ్చునని నా సూచన. తరువాత clause 9 క్రింద ప్రభుత్వము కొన్ని హక్కులను అట్టిపెట్టుకున్నారు. కొన్ని వస్తువుల మీద, కొంత మందిమీద, లేకపోతే State లో ఒక portion మీద exempt చేయడానికి ప్రభుత్వం హక్కులు అట్టిపెట్టుకున్నారు. క్లాజు 38 (4) లో powers of rule making క్రింద ఏలాగైతే హక్కుఉందో, ఏలాగయితే శాసనసభ ముందు పెట్టడానికి నిశ్చయించారో ఆలాగే clause 9 క్రిందకూడా చేయబోయేదికూడా శాసనసభముందు పెట్టినట్లై తే బాగుంటుందని నా అభి ప్రాయము. ముఖ్యంగా percentage విషయంలో ఇదివరకున్న రు॥ 1-9-0 ను ఉంచవలసినదిగా ప్రభుత్వాన్ని కోరుతూ సెలవు తీసుకొంటున్నాను.

*శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :- అధ్యక్షా, తెలంగాణా, ఆంధ్ర ప్రాంతముల లోని శాసనాలను సమన్వయం చేస్తామని ఒక బిల్లు తెచ్చారు. మొత్తం మీద ఈ శాసనాలు విభిన్నంగా వున్నప్పుడు వాటిని ఒక పద్ధతిలోకి తీసుకరావటం మంచిదే. ఆ ప్రయత్నం బాగానే ఉన్నది. కాని ఆ ప్రయత్నం ఎవరి ఉపయోగానికి ? ప్రభుత్వము ప్రతిసారీ చెపుతూంది: "మాకు ఆర్థికంగా కొన్ని ఇబ్బందులు ఉన్నాయి, కొంత పన్ను వసూలుచేసే సౌకర్యాలు చూపిం చండి" అని. ఈ సందర్భంలో నేను వారిని ఒకటి అడుగుతున్నాను- మనము Corporate State కు నడుస్తున్నామా లేక Democratic State కు నడుస్తు న్నామా అని. ప్రజానీకానికి ఉన్న కష్టాలను తీర్చేటట్లయితే వాళ్లు అడగాలి: "అయ్యా, మాకీకష్టాలు ఉన్నాయి, వీటిని తీరుస్తారా" అని. ఈ విధంగా ప్రజలు ప్రభుత్వాన్ని అడగడంపోయి ప్రభుత్వమే మాకీకష్టాలున్నాయి. తీర్చండని ప్రజలను అడిగితే, అది వాళ్ళమీద భారము వేయడమే అవుతుంది గాని వాళ్ళకు ఏమీ సుఖవు ఇచ్చేదిగా మాత్రం కాదు. Notionalisation ఏదైనా చేస్తే అది ఎవరికి ఉపయోగపడుతుంది ? అది ప్రభుత్వానికి ఆదాయం కొరకే ఉపయోగపడుతుంది. Socialisation చేసేటట్లయితే, ప్రజలకు ఉపయోగ పడుతుంది. ఈవేళ వేసే ఈ పన్నులు ప్రజలకు ఉపయోగ పడుతాయా? Sales Tax ఒక historical position లో ప్రారంభించామని చెప్పారు. Historical position లో మార్పు వచ్చింది ఏమీలేదు. అసలు మార్పు వచ్చిందల్లా రోజురోజుకూ ఇది పెరగడం. దీనివల్ల ప్రభుత్వానికి ప్రధానంగా ఆదాయం వస్తుందేమోనని ఆశ పడడం, నిజమే. అసలు tax వేయవద్దు అనే స్థితిలో లేము. వేయమంటామా. ఎవరిమీద వేస్తాము ? పెద్దపెద్ద వ్యాపారస్థుల

మీద వేయాలి అనేది వచ్చింది. దీనిని గురించి లోగడ ఒక కమిటీని కూడా వేశారు. Sales Tax Enquiry Committee వారు ఎంతమొత్తం turnover ఉంటే బాగుంటుందంటే, 10,000 రూపాయలు ఉంటే బాగుంటుం దని అనుకొన్నారు. అయితే దీనిని ఇప్పుడు 7,500 రూపాయలకు చేశారు. ఇది ఎవరి దృక్పథాన్ని బట్టి చేశారనేది ఆలోచిద్దాము. ఆ కమిటీ ఒక మాట చెప్పింది :

"A secondary objective to be kept in view in a revision of the tax system is the desirability of increasing the taxable turnover limit from the present one of Rs. 10,000 to a higher figure like Rs. 20,000 to release a large number of small traders from the difficulties inherent in taxation on accounts. The Trade interests however have in most cases stressed the need to reduce the limit of taxable turnover even below the present one of Rs. 10,000 with a view to checking evasion and of eschewing unfair competition. There is perhaps a conflict of interest here between the small trader and the larger one."

ఇది అందులో ప్రధానంగా ఉన్నటువంటి సిద్ధాంతము. ఈవేళ ఈ report మొత్తంగా ఆలోచిస్తే, ఇప్పుడు వేసినటువంటి taxation బాగా ఉన్నటువంటి వ్యాపారస్థులకు, లేని వ్యాపారస్థులకు మధ్యలో వున్నటువంటి తగాదాలో ఎవరిని బలపరుస్తూ వేయాలి అనే ఈ శాసనం నిర్ణయిస్తున్నది. కాని దీనిని బట్టిచూస్తే పెద్ద వ్యాపారస్థులు ఎవరైతే ఉన్నారో వారు తప్పించుకు పోతున్నారు. చిన్నవారిమీద వేయండి, వారి పేరట మేము కూడా తప్పించు కోడానికి వీలవుతుంది అనే విధంగా, ఆ ఉద్దేశంతోటి ఇది వేసినట్లు ప్రధానంగా అగుపడుతుంది. చిన్న వ్యాపారస్థునికి వచ్చేటటువంటి turnover ఏమిటో అదంతా శ్రీసుందరయ్యగారు చెప్పారు. దాన్ని గురించి మరల చెప్ప దలచుకోలేదు. కాని చిన్నవాళ్ళను రక్షించాలా, లేదా ? ఎవరిని రక్షించడానికి ఈ ప్రయత్నం చేయుచున్నారు అని ఆలోచించినట్లయితే, పెద్దవారిని రక్షించ డానికే ఈ ప్రయత్నం అని చెప్పవలసి వస్తుంది. మాకు డబ్బు లేదంటు న్నారు. నిజమే, ఇదివరకు ఒకసారి మనము tax వేశాము. Revenue tax వేయవలసి వచ్చినప్పుడు ఆలోచించాము. Tax system వచ్చినప్పుడు, revenue tax లో పూర్వం ఉన్నటువంటి పద్ధతికి ఇప్పుడు వున్నటువంటి పద్ధతికి చాలా తేడా వచ్చింది. Development Schemes చాలా వస్తున్నాయి. దానికోసం డబ్బు రావలసి యుంటుంది గనుక, కేంద్ర ప్రభుత్వము తమకు land revenue లో వచ్చేటటువంటి ఆదాయం ఎప్పుడైతే బలహీనపడిందో అప్పుడుఇతర taxes వేసుకొనేటటువంటి అవకాశాలన్నీ తాముపుచ్చుకొని చిన్న

వాటినిమనకు ఇచ్చేసింది.వీటితో సతమతమవుతూ ఉండేటప్పుడుsales tax పెట్టారు. క్రిందటి తడవ land tax లో ప్రయత్నం చేశారు. దానిలో srurcharge రు|| 0-1-0, 0-2-0, 0-4-0, 0-8-0 చొప్పున వేశారు. అది ఫిర్కాకు మాత్రం అనువర్తించాలని చెప్పారు. అందువల్ల జరిగిందేమిటి. ఎవరైతే ఫిర్కాకు మించి పొలము ఉన్నవాళ్ళు ఉన్నారో వాళ్ళకందరికి కూడా అనువర్తించకుండా ఎంత సేపటికి third slab అయినటువంటి 0-1-0 లోనే మిగిలిపోయేటటువంటి పరిస్థితి వచ్చింది. అందువల్ల పెద్ద భూస్వాములకు ఏదైనా వేసినప్పుడు చిన్న భూస్వాములకు సరిపోయేటట్లు దానిని ఉపయోగిస్తారు. పెద్దవాళ్లు చెప్పిన సలహాల ప్రకారం చిన్నవాళ్ళను కూడా కలుపుకు వచ్చేందుకు చేస్తున్నాము. ఈ taxation system దేనిమీద ఆధారపడింది, ఏ basis మీద ఆధారపడింది అంటే Taxation Committee ఆ రోజులలో చెప్పినప్పుడు, it is a conflict between the big trader and small trader అనే సలహా ప్రకారం శాసనమంతా జరిగించవని చెప్పక తప్పదు. అందువల్ల ఈ విధానం ఉన్నట్లయితే, ప్రజల క్షేమం చూడకుండా పెద్ద వ్యాపారస్థుల క్షేమం కోసము ఉన్నదని చెప్పక తప్పదు. ఈవిధంగానే వున్నట్లయితే చిన్నవారికి, వెనుకబడినటువంటివారికి కావలసిన రక్షణ లేకుండా ఉంటుంది. ఇది ఆర్థిక విధానంలోను, taxation విధానంలోను చాలా బ్రహ్మాండమైన పరిస్థితి అని మనవి చేయక తప్పదు.

తరువాత ఇప్పటి విధానం ఎట్లా వున్నది ? నయాపైసలు గురించి ఏమి చెబుతున్నారంటే ప్రపంచంలో అంతా ఆ పద్ధతినే పోతున్నారు కాబట్టి. మనం కూడా అవలంబించినట్లయితే సౌకర్యంగా ఉంటుందని చెప్పారు. కాని ఈ సౌకర్యము ఎవరికి ? ప్రజానీకానికా ? ఒక విధంగా ప్రభుత్వానికే దీనివలన ఎక్కువ ఆదాయం వస్తుంది. పోస్టల్ రేట్ల విషయములో చూస్తే, ఏదో కొద్దిగా అడ్జస్ట్‌మెంటు చేశాం అంటున్నారు. కాని మన ప్రభుత్వం కూడా టాక్సేషన్ విషయం వచ్చేటప్పటికి, ప్రజలు నయాపైసలయొక్క ప్రయోజనం పొందుటకు బదులు, ప్రభుత్వమే లాభం పొందుటకు ప్రయత్నిస్తున్నది. ఇవి ప్రజలకు ఒక గుదిబండగా తయారైంది. మన ఆర్థిక విధానంలో అక్కౌంటింగును సులభం చేయటానికి ఈ విధానంవలన అవకాశం ఉన్నదని చెప్పారు. కాని దీనివలన ప్రజలయొక్క డబ్బు ఎక్కువ పోతున్నది. తిరిగి ఇప్పుడు పన్నులు ఎవరిమీద వేస్తున్నారు ? టాక్సేషన్ కమిటీ రిపోర్టులో పేర్కొన్న సిద్ధాంతం చదువుతాను.

"However a tax on the sale of goods was not unfamiliar either to the people of anicient India, or to the other older

civilisations of the World. The only difference is that whilst it was intended in historic times to be a tax on merchants, the present day theory is that sales tax is a consumer tax to be passed on to the buyer by the dealer."

ఇది చాలా అన్యాయం. ఈ పాతపుస్తకాలు చదవడం ఎందుకు అన్నట్లుగా గోపాలరెడ్డిగారు చూస్తున్నారు (నవ్వు). ఇదివరకు కొనేవాడిమీద, అమ్మే వాడిమీద పడకుండా, వ్యాపారానికి సంబంధించినంతవరకు మాత్రమే పన్ను పడే విధానం పూర్వం వుండేది. ఈ నాడు, డీలరు పేరుతోటి consumer కొనేవానిమీద కూడా వేస్తున్నారు. ఆ విధానం సేల్సుటాక్సు అనుపించుకోదు. పర్ ఛేజ్ టాక్సు అవుతుంది, ఇది పర్ ఛేజ్ మీద పడకూడదు, కన్ స్యూమరు మీద పడకూడదని మనవి చేస్తున్నాను, మధ్య వ్యాపారం చేసేవాని మీద పడాలి. కాని కన్ స్యూమరు నుంచి మొట్టమొదటనే లెక్కకట్టి, ఇస్తావా, లేదా అని అడిగి వసూలు చేస్తున్నారు. ఇందాక కొంతమంది మిత్రులు మాట్లాడుతూ, ఇది వ్యాపారస్థులు ఎందుకు వసూలు చేయాలని అడిగారు. కాని వారిని వసూలు చేయమని చెప్పలేదు. వారు వ్యాపారం చేస్తున్నారు గనుక డబ్బు ఇచ్చుకోవలసిన పద్ధతి వున్నది. తరుపాత, "evasion" "పన్ను ఎగగొట్టడం" ఆపటానికి ప్రయత్నిస్తున్నామని అన్నారు. గుంటూరు టౌనులో చూస్తే, అక్కడ వచ్చే లారీలను, పోయే లారీలను పట్టుకొంటున్నారు. అక్కడ నాలుగు రోడ్ల కూడలిలో ఆఫీసర్లు కూర్చొని లారీలను ఆపుతున్నారు. ఆ లారీలతో బాటు బస్సులను కూడా ఆపేస్తున్నారు. వానివలన ప్రయాణీకులకు ఇబ్బంది కలుగుతోంది. ప్రయాణీకులు రైలుకు పోవాలి, టైము అయిపోతోందని చెప్పినప్పటికి వినకుండా బస్సులను వెళ్ళనివ్వకుండా అభ్యంతరపెట్టి, అంతా తమరే సుప్రీం అథారటీ అన్నట్టుగా అక్కడ లైను క్లియర్ అయ్యేవరకు వెళ్ళడానికి వీలులేదని, అఫీసర్లు వ్యవహరిస్తున్నారు. అక్కడ ఆఫీసరు ఎవరో నాకు తెలియదు గాని, ఇది రోజూ జరుగుతున్నటువంటి సంఘటన. గుంటూరులో నాలుగు రోడ్లు కలసేచోట, ప్రధానంగా అటు మద్రాసు, ఇటు కర్నూలు, పొందుగల పోయే రోడ్లు కలిసేచోట ఇటువంటివి జరుగుతున్నాయి. అందరికీ తెలుసు. అసలు ఈ "Evasion", పన్నుల ఎగవేత, ఎక్కడ జరుగుతోంది? అది పెద్ద వ్యాపారస్థులు చేస్తున్నారన్నారు. అతి రహస్య రిపోర్టుస తయారు చేస్తున్నామన్నారు. కాని ఇంతవరకు ఎవరైనా పట్టుకొన్నారా? లేదు. పెద్దపెద్ద మొత్తాలు ఎవేట్ చేసేవారంతా సురక్షితులుగా ఉంటున్నారు. పెద్ద అఫీసరు అయితే పెద్ద వ్యాపారస్తులతో కలసిపోతాడు. చిన్న అధికారి అయితే చిన్న వ్యాపారస్థుని ఏడిపిస్తుంటాడు. వీరికి వేలల్లో ఉంటుంది. పెద్ద వ్యాపారస్థులకు లక్షలలో ఎవేషన్ వుంటుంది

వారంతా కలసి ఆవిధంగా తప్పించుక బయటపడదానికి ప్రయత్నిస్తున్నారు. అందువల్ల ఈ రోజునవున్న పద్ధతిలో, తామపాము చుట్టలాగున, చుట్టి చుట్టి పన్నుల భారం అంతాకూడ క్రిందివాళ్ళ మీద పడుతోంది. క్రిందివానిని పట్టు కుంటేనే ఏదోవిధంగా బాధపడుతూ ఇస్తాడు అంటే, తెలుగులో ఒక సామెత వున్నది; "గుమ్మడికాయంత కంతలు చూడకుండా, ఆవాలు పోయే రంధ్రము పట్టుకున్నట్లు" చిన్నవానిమీద వేయుటకు ప్రయత్నించడం. 7,500 వ్యాపార లిమిట్ నిర్ణయించటం అన్యాయం అని మనవి చేస్తున్నాను. మనం వేసే టాక్సెస్‌కు ఎప్పుడు చూచినా రిగ్రెసివ్ టాక్సెస్ గానే ఉన్నాయి గాని, ప్రోగ్రెసివ్ టాక్సెస్‌గా లేవు, ఎప్పుడూ చిన్నవారిమీదే పడుతున్నాయి.

క్రిందటితడవ ప్రభుత్వం ఇచ్చిన డ్రాఫ్టులో మిల్లెట్స్ లేవు. ఆర్థిక మంత్రి గారు చెబుతూ మిల్లెట్స్‌మీద చాలా రోజులనుంచి పన్ను ఉన్నదని చెబు తున్నారు. చాలా రోజులనుంచి ఉంటే క్రిందటిసారి ఇచ్చిన ఒరిజినల్ డ్రాఫ్టులో ఎందుకు లేదు?

శ్రీ రావి నారాయణరెడ్డి: (భువనగిరి) జనరల్ దానిలో వస్తుంది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య: జనరల్ దానిలో వస్తే ఇప్పుడు ఎందుకు కలపాలో అర్థం కావడం లేదు. జాబితాలో ఎందుకు వ్రాయాలి? జనరల్ దానిలో వస్తే సంతోషమే.

డాక్టర్ బి. గోపాలరెడ్డి: అది కన్సెషనల్ రేటుక్రింద వచ్చినది కాబట్టి ప్రత్యే కంగా చెప్పవలసి వుంటుంది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య: కన్సెషన్ ఎంత ఇచ్చారు. మల్టీ పాయింటు నుంచి సింగల్ పాయింటుకు కన్సెషన్ ఇచ్చామన్నారు. ఎవరికి ఇచ్చారు కన్సెషన్? రత్నాలు, వజ్రవైఢూర్యాలు కొనేవారికి కన్సెషన్ ఇచ్చారు. అంతకు ముందు అర, వుంటే ఇప్పుడు 1/4 కు తగ్గించామని చెప్పారు, ఈ కన్సెషన్ వారికి ఎందుకు? క్రిందివారికి ఇవ్వకూడదా? కన్సెషన్ ఇచ్చినపుడు ఎవరికిస్తున్నారనేది చూడాలి. మల్టీపాయింటు, సింగల్‌పాయింటు చేయటమనేది మంచిదే. అసలు తిండి పదార్థాల మీద పన్ను వేయకుండా వుండాలనే ప్రధానమైన సిద్ధాంతం వున్నది. ఇదివరకు కేంద్ర ప్రభుత్వం ఒక యాక్టు చేసింది. అన్ని రాష్ట్రాలకు వచ్చిన ఆదాయం ఎవరు పరిష్కా రము చేసుకోవాలనే తగాదా వచ్చినప్పుడు ఆ యాక్టు మారిపోయి మొత్తం అధికారం వారే తీసుకొన్నారు. ఆ యాక్టు పోయింది, ఇప్పుడు కొన్ని తిండి పదార్థాలమీద తగ్గించే విధానం ఉన్నదా? అంటే లేదు. ఎందువల్ల లేదో సుందరయ్యగారు చెప్పారు. రిపోర్టులో వ్రాసి వున్నది. పుల్లిపాయలు

వగైరా మీద తీసివేయాలని చెప్పారు. ఎవరో వ్రాసిన రిపోర్టు కాదు అది. ఈ మిత్రులే వ్రాశారు. అది మెజారిటీ రిపోర్టు. ఆ రిపోర్టులోని సూచనలు అంగీకరించేస్థితిలో లేనప్పుడు ఏమిచేయాలనేదిప్రశ్న. మొత్తంగా ఆలోచిస్తే పోతనగారుచెప్పినట్లు "మంచిగుణములెల్ల మనుజరూపముదాల్చె" అనేది తల క్రిందులుగా మారి "అవగుణములెల్ల ఆకారముదాల్చి" అన్నట్లుగా, అపద్ధతిలో అన్ని లోట్లు పూసగ్రుచ్చినట్లుగా ఒకచోటచేర్చి ప్రజలు ఎట్లాయిబ్బంది పడతారా, అనేపద్ధతిగా యిది కనబడుతోంది.

పుగాకుమీద పన్ను వేయవలెనా, తీసివేయవలెనా అనేసమస్యవచ్చింది. కేంద్రప్రభుత్వం పుగాకుమీద సర్‌ఛార్జి వేయబోతోంది, అందువల్ల యిప్పుడు మనం వేయకుండా ఊరుకుంటే బాగుంటుందన్నారు, కాని వేశారు. కేంద్ర ప్రభుత్వం యిస్తారని అంటున్నారు. కాని కేంద్రప్రభుత్వం యిస్తామనలేదు, మేము సజెస్టుచేస్తే యిస్తామన్నారనేపద్ధతిగా చెప్పారు. అది నాకుసరిగా బోధ పడలేదు.

ఈ సేల్సుటాక్సు గురించి వివరాలు యిచ్చేటప్పుడు ఈ రాష్ట్రంలో, ఆ రాష్ట్రంలో ఉన్నధరలు. వారుచేసిన మార్పులు తెలుసుకుందామంటే వివరములు లేవు. మద్రాసుఆక్టు పాతది దొరకలేదు. ఆ అమెండ్‌మెంట్సు అన్నీ సేకరించి చదువుకోవాలి. ఆ వివరాలన్నీ ఫైనాన్సు డిపార్టుమెంటువారు సభ్యులందరికీయిస్తే దేనిమీద ఏవిధంగా ఎంతెంత మార్పువచ్చిందో తెలుసుకొనుటకు వీలుండేది. మేము ప్రయత్నిస్తే దొరకలేదు. ఈ రిపోర్టు నిన్న సాయంత్రం మాచేతికి వచ్చింది. ఒరిజినల్ రిపోర్టు వచ్చినప్పుడు ఏమనిచెప్పారంటే, యిప్పుడు చర్చ ఎందుకు, జనరల్ సమస్య వచ్చినప్పుడు చర్చఉంటుంది, అన్నారు. ఇప్పుడు పూర్తిగా వివరాలులేవు. అవి తెలుసుకోకుండా, ఎంత ఆదాయంవస్తుందనేది స్టడీచేయకుండా మాట్లాడటం ఎట్లాగు? ప్రభుత్వానికి వచ్చే ఆదాయంలో నాల్గవవంతు దీనిమీద వస్తున్నపుడు జనానికి ఎంత ఇబ్బంది కలుగుతున్నదో మనం ఆలోచించాలి. పూర్తిగా టాక్సేషన్ వద్దని చెప్పుటలేదు. వద్దంటే డబ్బు ఎలావస్తుంది? అయితే పన్ను ఎవరిమీద వేయాలి అనేదే సమస్య. బరువుమోసేవానిమీదే యింకావేస్తూ, తప్పించుకు వెళ్ళేవానికి దణ్ణంపెట్టి, దగ్గరకు వచ్చినవానిమీద మొత్తంబరువు వేయటం న్యాయంకాదు.

కుటీరపరిశ్రమలు డెవలప్‌చేయాలని అంటున్నారు. దానికి కావలసిన ప్రణాళికలు తయారవుతున్నాయి. వాటికి టాక్సుకావాలి, రూల్సు ఉన్నాయి, కాని ఆరూల్సుఅన్నీ అమలుజరిపితే అసలు అవి నడవవు. వాటికి ప్రొటెక్షన్ యిచ్చారాఅంటే యిచ్చారేమో తెలియదు, యిస్తే సంతోషిస్తాను. లేకపోతే

వాటికి Exemption యివ్వటం చాలా అవసరం. కుటీర పరిశ్రమలు డెవలప్ కావాలంటే, అవి అభివృద్ధికావాలంటే, వాటికి ప్రొటెక్షన్ యివ్వాలి.

పెద్ద ఖరీదుగల వస్తువులమీద తక్కువపన్ను వేస్తున్నారు, ఎక్కువ వేయకూడదని కేంద్రప్రభుత్వం ఆదేశం ఉన్నదా? లేక కాన్‌స్టిట్యూషన్ డిఫికల్టీస్ ఉన్నాయా ?

Precious stones మీద మూడు నయాపైసలు పన్ను వేయబోతున్నారు. ఆపన్ను ఎక్కువ చేయాలని నేంకనుక ఎమెండ్‌మెంట్ పంపిస్తే మీరుపన్ను ఎక్కువచేయటానికి హక్కులేదు; మళ్లీ గవర్నరుగారివద్దకు పోవాలిగనుక మీరు ఆవిషయాన్ని ముట్టుకోవద్దు అంటారు. మరకత, మాణిక్యాలు వాడేవాళ్ల ఆశీర్వచనములకోసం చూస్తూ. మీరేమో వాళ్లమీద పన్ను వేయరు. ఇక ఎక్కడనుంచి వస్తుంది డబ్బు? అందుచేత పెద్దవాళ్లమీద పన్ను వేయవలసిందిగా ప్రభుత్వానికి చెబుతున్నాను. పెద్దపెద్ద టైంపీసెస్ అవీ ఉన్నాయి వాటిమీద ఇంకా ఎక్కువ పన్ను ఎందుకువేయకూడదని అడుగుతున్నాను. మోటారు కార్లు ఉన్నాయి. వాటినిచాలామంది కొంటున్నారు. కాని తిరిగేవాళ్లమీద మాకు కోపంలేదు. నేను చెప్పేది' కార్లమీద బాగా పన్నువేయాలని. వాటిమీదఇప్పుడు ఉన్న పన్నుచాలదు. ఇంకా బాగా పన్ను వేసినప్పటికీ వాళ్లకు నష్టంలేదు. వాళ్లకు ఒకపూట పెట్రోలు ఖర్చు అంతకూడ అవదు. వాళ్లకు ఆ ఎక్కువ పన్ను ఏమాత్రంభారంగా ఉండదు. వారు ఆఎక్కువపన్నును పెట్రోలు కన్‌సంప్షన్‌లో సర్దుకోగలరు. కనుక, మీరు మోటారుకార్లమీద ఇంకా ఎక్కువ పన్ను ఎందుకు వేయకూడదని అడుగుతున్నాను. మీరు పేదవాళ్లపైన, చిన్నవాళ్లపైన అదనపుపన్నులు వేస్తున్నారు. పెద్దవాళ్ళ రక్షణకోసం చిన్నవాళ్లమీద పన్నుల బరువును వేస్తున్నారు. కాబట్టి, యీవిధానాన్ని పూర్తిగ వ్యతిరేకించవలసిన అవసరం ఉన్నదని అంటున్నాను. ఈరిపోర్టులో పెద్దమార్పులు ఏమీ చేయలేదు రిపోర్టులో ఏమైనా మార్పులు జరిగాయా అని చూస్తే, ఏమీ మార్పులు జరగలేదు. పైగా పెద్దవారిపైన ఇదివరకు ఉన్న నిర్బంధాలను తగ్గించటానికి ప్రయత్నం చేస్తున్నారు. ఎవరైతే డబ్బు దాచేసి. ఇవ్వకుండా ఎగవేస్తున్నారో వారిని శిక్షించకుండా వదిలి పెడితే లాభంలేదు. వారు ఎవరిని శిక్షిస్తున్నారు? చిన్నవారినా? బంకు మేనేజరునా? బంకుమేనేజరుకు ఎకౌంట్ తెలియదు. గుంటూరు-1 నుంచి వచ్చిన మిత్రులు జాలయ్యగారు ఒక సూచన చేశారు. వారు ఏమన్నారంటే 'ఆఫీసర్సుకు ఇచ్చేటటువంటి అవకాశములు చిన్నవాళ్లకు ఇచ్చేటట్లయితే, తాలూకా హెడ్‌క్వార్టర్స్‌లో ఉండేటటువంటి ఆఫీసర్సుకు ప్రాసి

క్వ్యాషన్ అవకాశము ఇచ్చినట్లయితే చాలా ప్రమాదం వస్తుందేమో నని, నాకు ఒక నమ్మకము ఉన్నది' అని. అతనికి అధికారం ఇచ్చినట్లయితే లక్షల రూపాయలు వ్యాపారము చేసే వారికెవరికీ ప్రమాదం ఉండదు. ఎవరికి ప్రమాదం వస్తుందంటే, 5 వేలు, 3 వేలు, 2 వేలు. వ్యాపారం చేసేటటువంటి చిన్న వ్యాపారస్తులకు. ఈ చిన్న వ్యాపారస్థులే ఎప్పుడూ భయపడాల్సి వస్తూ ఉంటుంది. జాలయ్యగారు భూమిమీద వస్తుందని చెప్పుతున్నారు. వారికి ఏమీ ఇబ్బందిలేదు. వారికి ప్రభుత్వ రక్షణ ఉన్నదని వారికీ తెలుసు ఆ సంగతి నాకూ తెలుసు. వారికి రక్షణ ఉన్నదని చెప్పేసి, వారు పూర్తి రక్షణతోటి. బహుశా కర్ణుడికిగనుక వజ్రకవచం ఎట్లాగైతే ఇచ్చారో అట్లాగే, ఇవాళ వారికి వజ్రకవచం ఇస్తున్నారని మాత్రం ఖచ్చితంగా నేను మనవి చేస్తున్నాను. అందువల్ల యీ చిన్నవాళ్లను రక్షించే విధంగా క్లాజెస్‌ను తయారుచేస్తే బాగుంటుందని చెబుతున్నాను. ఈ టాక్సేషన్ విధానం మారి కేంద్ర ప్రభుత్వ టాక్సేషన్ వస్తే, అది ఎంత ఇస్తుందో తెలియదు. దాదాపు యీ రోజున వస్తున్నటువంటి యాక్ట్సు చూస్తూంటే, కేంద్రప్రభుత్వం యీనాడు ఫెడరల్ గవర్నమెంటుగా నడుస్తున్నాదా, లేక యూనిటరీ గవర్నమెంట్‌గా నడుస్తున్నదా అనే అనుమానం కలుగుతున్నది. అటూ, ఇటూ కాకుండా మధ్యగా ఉండే పేరుతోటి, యూనియన్ అని అన్నారనుకోండి. పోనీ, ఫెడరల్‌గవర్నమెంటు అనుకొందామా, మనకున్నటువంటి పన్నుల అవకాశాలన్నీ ఒక్కొక్కటే వాళ్లకు పోతున్నాయి. రెండు స్టేట్సుకు వివాదం వస్తే, యీ స్టేట్సు వివాదాలు మీలోమీరే తేల్చుకోమనేబదులు, మేమే తీర్చుతామని ఒక యాక్టుచేసి, దానిని బిచ్చంబెట్టినట్లు ఇవ్వటానికి ప్రయత్నం చేస్తున్నారు. డెవలప్‌మెంట్‌వర్క్సు తీసుకొందామా, వాటి విషయం వచ్చే టప్పటికి మన నిర్ణయం లేకుండా, ప్లానింగ్ కమీషన్ పేరుతోటి కేంద్ర ప్రభుత్వమువారే ఆ నిర్ణయం చేస్తున్నారు. కాబట్టి, మనము ప్రారంభించినది ఫెడరల్‌గవర్నమెంటుతోటి. ఏర్పడిందేమో ప్రొవెన్షియల్ ఎటానమీతోటి. రోజురోజుకు హ్రస్వీకరింపబడుతూన్న అధికారాలతోటి మనం యీ టాక్సేషన్ ఎన్నాళ్ళు నడుపుతాం? కేంద్రప్రభుత్వం రోజురోజుకూ టాక్సెస్ వేసే అధికారం తీసుకొంటూంటే ఏమి అవుతుంది? అందువల్ల మనం కేంద్ర ప్రభుత్వం మనకిచ్చిన అధికారములు ఏవైతే ఉన్నాయో వాటిని దృఢపరచు కొంటూ, మరికొన్ని అవకాశాలు మనం సంపాదించుకునేందుకు ప్రయత్నం చేయాలి. ఇవాళ మన జిల్లాబోర్డులు పూర్తిగా వొట్టిపోయినాయి. వాటిమీద ఏ పన్ను వేద్దామన్నా భయమే. రాష్ట్రంలోనుండి, ఏ పన్నులు వారికిద్దాము? వాళ్లకు ఇదివరకు ఇచ్చిన పన్నులు కూడ మినహాయించబడుతున్నవి. వాళ

డబ్బుకూడ మనమే తీసుకొంటున్నాము. "అబ్బాయీ; ఆగండి. మీకు జిల్లా బోర్డులు ఎటూలేవుగనుక, ఆ పనులు చేసేది మేమేగనుక, ఆడబ్బుకూడ మాకే ఇస్తే, మేమే ఖర్చుచేస్తాము" అని జిల్లాబోర్డు అధికారములు కూడ తీసుకోవటం జరిగినది. లోకల్ బాడీస్ అధికారములు పోయాయి. ప్రొవిన్షియల్ ఎటానమీ పోతోంది. కేంద్రంనుంచి మనకు డబ్బు ఎంత వస్తుందో తెలియకుండా ఉన్నది. మనకు ఉన్నటువంటి అధికారములు ఏమిటో నిర్ణచనము కావటము లేదు. ఒక్క అధికారము మాత్రము ఉన్నది; సామాన్య ప్రజానీకం మీద ఎప్పుడు పడితే అప్పుడు ఏ నిమిషం పడితే ఆ నిమిషం మనం పన్నులు వేయవచ్చు. ఇంకా పోలీసు మనోతత్వంతో ఉన్నటువంటి అధికారముచేత పోలీసు నిరంకుశత్వం సాగించే పద్ధతితోనే—పోలీసు నిరంకుశత్వం అనటం లేదు—పోలీసు విధానపు నిరంకుశత్వం అనే పద్ధతితోనే యీ అధికారం ఇవ్వటం జరుగుతోంది. ఇదే లంచగొండితనం పెరిగిపోవటానికి అవకాశం ఇస్తున్నది. దీనిని అరికట్టే విధము ఏమిటంటే. మొట్టమొదట పెద్దవాళ్లను అరికట్టాలి. పెద్దవాళ్లను శిక్షించాలి. ఎవరైతే evade చేస్తున్నారో, వాళ్లను ఎవేడ్ చేయాలి. ఇన్‌కంటాక్స్ సమస్య వచ్చినప్పుడు. కేంద్ర ప్రభుత్వం ఎవేషన్ కమిటీని వేశారు. వారు చెప్పింది, 300 కోట్ల రూపాయలు ఎవేడ్ అయిపోతున్నాయి, మా దగ్గరకు రావటం లేదు. అని. ఈ విధంగా వాళ్ల రిపోర్టులో ఉన్నది. అక్కడ మూడు వందలకోట్ల రూపాయలు ఎవేడ్ అవుతూంటే, దానిని పట్టుకోకుండా ఇక్కడ చిన్నవాళ్లపైన పన్నులువేస్తే ఏమి లాభం వస్తుంది? మూడువందలకోట్ల రూపాయలంటే హోల్డన్ నికల్సన్ చెప్పిన ప్రకారంగా, అయిదు వందల కోట్లు వచ్చేటటువంటి విధానంతోటి ఆయన చెప్పాడే. కాబట్టి ధనవంతులమీద బాగా పన్ను వేసేటట్లయితే, బహుశా యీ చిన్న చిన్న పన్నులు వేయకుండా తప్పిపోయేస్థితి కేంద్ర ప్రభుత్వం యిచ్చేటటువంటి పర్సంటేజిలోని మార్పుతోటి సరిపోతుందేమోనని అనుమానంవేస్తుంది. అందువల్ల ప్రభుత్వం దయచేసి పేదవాళ్ళమీద, చిన్నవాళ్లమీద, పది వేలు, 25 వేలు లోగా ఉన్నటువంటి వాళ్ళమీద పూర్తి నిర్బంధములు పెట్టండి. 50 వేలు పైన ఆదాయం వచ్చేవాడిమీద మన దగ్గర ఎన్ని అధికారాలు ఉన్నాయో అన్ని అధికారాలు ఉపయోగించి, బలం అంతా ఉపయోగించి నిర్బంధములు పెట్టండి. ఆ విధంగా ఆదాయాన్ని అభివృద్ధిచేసి, దేశాన్ని అభివృద్ధి చేయండి, అప్పుడే ప్రభుత్వం దగ్గర డబ్బు ఉన్నదని అంటే అర్థం ఉంటుంది. అంతేగాని ప్రతిదానికీ పేదప్రజలను అడగటం న్యాయం కాదని చెబుతూ నేను ముగిస్తున్నాను.

శ్రీ టి. జి తిమ్మయ్యశెట్టి (కోసిగి):- అధ్యక్షా! జనరల్ సేల్స్ టాక్సు కన్సాలిడేషన్ బిల్లు శాసనసభలో ప్రవేశపెట్టడం జరిగింది. దీనిని ఇదివరకే సెలక్టు కమిటీలో చర్చించడం జరిగింది. అయినప్పటికి, యీ బిల్లులో మార్పులు లేకపోవడం వలన తిరిగి నేను ఒక సలహా ఇవ్వాలని అనుకొంటున్నాను. ఈ లిమిట్స్ ఆంధ్రలో ఏడున్నర వేలు. తెలంగాణాలో పది వేలు అని నిర్ణయించడం జరిగింది. తెలంగాణాతో పదివేలు ఉన్నప్పటికీ, ఆంధ్రలో ఏడున్నర వేలు ఉన్నప్పటికీ, చిన్న వ్యాపారస్తులు ఎక్కువమంది దీనివల్ల ఎఫెక్టు అవుతారని, దీనివల్ల ప్రభుత్వానికి ఎక్కువ లాభంరాదని, అందువల్ల రాష్ట్రం అంతాకూడ, పది వేలకే లిమిట్ చేస్తే బాగుంటుందని ఆ రోజున సలహా చెప్పాను. అదే ప్రకారంగా చేస్తే బాగుంటుందని తిరిగి ప్రభుత్వాన్ని నేను కోరుతున్నాను

ఇంతే కాకుండా పెనాల్టి క్లాజులో సర్చెస్ విషయంలో ఆఫీసర్సుగాని, అసెసర్సునుగాని నియమింపకోకుండగా జనరల్‌గా చెప్పారు. అట్లా కాకుండా ఏ అసెసీ, ఎలాంటి ఆఫీసరు ఎవరెవరిని సర్చ్ చేయవలెను అనేది ఫిక్స్ చేస్తే బాగుంటుంది. చిన్న ఇనస్పెక్టరు కూడా వర్తకుణ్ణి చాలా ఇబ్బంది పెట్టాలనే వాణ్ణి చాలా అమర్యాద చేయాలనే ఉద్దేశ్యముతో ప్రయత్నముచేసే అవకాశము లేకుండా చేయాలి, ఏదో ఒక లిమిట్ పెట్టి, గెజిటెడ్ ఆఫీసరు అయితే అలాంటివాణ్ణి సర్చి చేయాలి. అంతకంటె చిన్న ఆఫీసరు అయితే ఇలాంటివాణ్ణి సర్చి చేయాలి అనేటటువంటి డిస్టింక్షన్ కూడ పెట్టి సర్చెస్‌కు పవర్స్ యిస్తే బాగుంటుందని నేను సూచిస్తున్నాను.

ఇక నాన్ పేమెంట్ ఆఫ్ ఫీజు విషయంలోకూడ ఇంప్రిజన్‌మెంటని అన్నారు, ఫీజు ఇవ్వనంత మాత్రాన వారికి ఇంప్రిజన్‌మెంటనేది చాలా అన్యాయము. ఫీజు యివ్వనప్పుడు దానిని కలెక్టుచేసే ఉపాయము ఉన్నది. అందుకు పద్ధతి ఉన్నది. దానికికూడ ఇంప్రిజన్ చేయటమనేది చాల ఘోరమైన విషయము. దీని విషయంలో సేల్సుటాక్సు ఎంక్వయిరీ కమిటీ కూడ ఒక రిపోర్టు ఇచ్చింది. అలాంటప్పుడు 30-ఇ-ని తొలగిస్తే బాగుంటుందని సలహా యిస్తున్నాను. ప్రభుత్వము చూపిన షెడ్యూలులో సింగిల్ పాయింట్ టాక్సు క్రింద కొన్ని పదార్థములు చేర్చి వ్యాపారస్థుల కష్టములు తగ్గించేందుకు ప్రయత్నించాలి. ఇందులో ప్రభుత్వానికి ఆదాయాన్ని ఎక్కువచేసే పదార్థములుకూడా వున్నవి. అందులో ప్రత్తిగింజలు ఒకటి. ఈ ప్రత్తిగింజలను కూడాదాంట్లో చేర్చి చిన్న వ్యాపారస్థుల ఇబ్బందులు తొలగించేదానికి అవకాశం వుంటుంది. ఈ చిన్న వ్యాపారస్థులు గుమాస్తాను పెట్టి లెక్కలు సబ్‌మిట్

చేయటము, ఆ లెక్కల్లో పొరపాటు ఉన్నదని ప్రభుత్వ సిబ్బంది అనటము, వాళ్ళను ఇక్కట్టుల పాలు చేయటము మొదలైనవి లేకుండా కాటన్ సీడ్స్ మొదలైన పదార్థములను అందులో చేరిస్తే వాళ్ళ ఇబ్బంది తగ్గటమే కాకుండా అందువల్ల ప్రభుత్వానికి ఆదాయములో వ్యత్యాసము రాదని ప్రభుత్వానికి నేను సూచన చేస్తున్నాను.

Mill cloth విషయములో ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలో యీ taxes లో చాలా తేడా వుంటున్నది. ఆంధ్రలో జాస్తిగాను, తెలంగాణాలో తక్కువగానూ ఉంటున్నది, అందువల్ల ఆంధ్ర తెలంగాణాలకు మధ్యనున్న border area లో యీ tax ఎక్కువగా affect కావడము, సరుకులు escape కావడముకూడ జరుగుతున్నది. ఆంధ్రలోనూ, తెలంగాణలోనూ ఎక్కువచేసే బదులు. తెలంగాణాలో మాదిరి అన్నిచోట్లను తగ్గించి, యీ tax ను సమన్వయపరచమని సూచిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

SRI V. K. NAIK: Mr. Speaker, Sir, The Andhra Pradesh General Sales Tax Bill, which is now before the House is, as many of the Members have stated, the result of the consolidation of the various enactments obtaining in Andhra and Telangana and their provisions. It is a happy augury that there should be a consolidation of these enactments.

I wish to make it clear to the House that I am supporting the Bill——I am not opposing it. But at the same time I wish to place before the House the feelings of those outside this House, how the people (the consumers) and how the merchant class view this Bill. Before enacting a legislation of this type, we should first consider whether we are giving any relief to the people or whether we are going to tax only to bring to the exchequer more money. If the consolidation is confined only to the provisions that are existing now and that differ in the Andhra and Telangana areas, we could have discussed something of which the public would not have been particular, but the motive behind the Bill is to raise the revenue from Rs 7½ Crores to Rs. 9 Crores. I agree we have to do it; we have several things to do for the welfare of the people and the Government can do it only by raising the revenue; there is no other source but taxation.

I do not, at this stage, wish to go into the general incidence of taxation or into the principles or policy of taxation. As the hon. the Speaker has suggested, let us restrict ourselves to the particular items covered in the amendments made by the

Select Committee. While I would deal with these amendments at the time of the clause-by-clause discussion, I would in short, submit that neither the public nor the merchant class is pleased with the Bill. The merchant class is collecting the tax for nothing. The Patels and Patwaries are given at least some remuneration for the collection of land revenue, but what remuneration, I would like to ask, is given to the Merchant class ? I do not consider that there is much difference between a big merchant and a small merchant, though some of the members of the Opposition have differentiated one class from the other; they are all one class, whether the merchant is big or small, though there is difference in the quality of the trade one deals with. The merchant class always submits that it is doing some service to the Government expecting some return, but what returns are they getting? Why should there be some suspicion or a notion that the merchant class is always crooked? For instance, certain suggestions have been made advocating the classification of millets and pulses into one category and we were told by the Government that the merchants have evaded tax on pulses Subsequently we went to the merchants and asked them, "you have given us certain memorandum suggesting certain amendments and not agreeing with the proposals of the Government and here is a report of the Government which says that you have evaded tax. What have you to say?". Allow me to submit, Sir, that this report stands to correction. The merchants said: "We are here to co-ordinate the policies of the Government; we are here to co-operate with the Government in collecting the taxes as much as feasible, but if something is imposed which is not within our reach we cannot do it; we are hard hit. There are certain limitations in everything." While tax on millets was brought to a single point, the tax on pulses was not brought to this point only on the plea that the merchant class was evading tax. The theory advocated was that if tax was evaded at one point, it could be collected at the other points. This theory, I am sorry to say, Sir, does not stand to reason. If the merchant wishes to evade the tax at single point he can evade it even if it is at multi point; if he is of that nature he will evade the tax to the end. We should not doubt the integrity of the people. Pulses come mostly from outside the city areas. The Government have got information regarding wagons and loads coming from outside as for example wheat coming from the Punjab or wheat coming from Marathwada area. Similarly the Government can have information regarding pulses and they can have a check on them by keeping their Inspectors. The machinery

of the Government must be active to find out where the purchase point or the sale point is. I have given only one example. There are various other examples from which the Government can collect its taxes and increase its revenue. But let us not blame the merchants unnecessarily.

Now I shall go to the consumer class. Can anybodv say that the consumer class is happy? It is not only trader who is dissatisfied; even the consumer class is not satisfied. So this Bill which was meant mainly to consolidate the enactments obtaining in Telangana and Andhra, takes the form of materially benefiting the Government exchequer, but it does not materially benefit either the merchant or the consumer. That is the general opinion prevailing today in both the classes.

This Bill has come up for our consideration too soon. We have not given sufficient time for the people to make their feelings known to us. We want money, we do need money, but let us at least have sympathy for the people from whom we are taking the money. Let us not give an idea that the Bill has been rushed. It was discussed for only one day in the Assembly and was referred to the Select Committee, which discussed it for three days; the Select Committee has discussed it at some length. But does the public know what has been done? Even for the Assemly members the Select Committee report was given only one day before it came up before the House. If there is any scope let us extend the Bill to another day and let us give the public the chance to express their opinion and then let us pass the Bill. As I have said, I have to support the Bill, but I would tell you that neither the merchants nor the consumers are pleased with it. We do not know the views of the consumers; let us obtain them. There is the merchant class and there is their memorandum. We have of course, looked into it and made some alterations and there are certain deletions and additions. It was only yesterday that I had seen that one new Article had been added in the Bill. Let us consider the whole thing peacefully; let us speak with the respresentatives of the public and let us take the sentiments of the people into consideration. I pray that the Government should give some more time for the public to express their views.

Thank You.

శ్రీ పి. సత్యనారాయణ (సామర్లకోట):-అధ్యక్షా! ఈ బిల్లు Select committee కి వెళ్లిన తరువాత ఏవో కొన్ని మార్పులయినా జరుగుతాయని అనుకొన్నాము. కాని అటువంటిదేమి జరుగలేదు. ఇది చాల దురదృష్టకరము. ఇటీవలి వారం రోజులలో అసెంబ్లీ సభ్యులమంతా మా మా నియోజకవర్గాలకు వెళ్లినప్పుడు అక్కడ ఉండేటటువంటి చిన్న, పెద్ద వర్తకులతో ఈ విషయమై సంభాషణలు జరిపాము. వారికి ఉండేటటువంటి సాధకబాధకాలన్నిటిని కొంతవరకు తెలుసు కున్నాం. అధికార పార్టీ అయినా, కాంగ్రెసులో ఉండేవారు కూడా చాలమంది ఏ విధంగా చెపుతున్నారో దీనిని బట్టే బోధపడుతూనే ఉన్నది. 7,50 రూపా యలు turnover ఉండేటటువంటి వారికి కూడా sales tax వేయాలనేటటువంటి విషయంలో చిన్న వర్తకులలో చాల ఆందోళనగా ఉన్నది. Accounts పెట్టే విషయంలో మీరు ఎంత సులభతరమైనటువంటి విధానాన్ని నిర్ణయించి నప్పటికీ, అసలు వారిలో చాలమంది నిశానీదారులు ఉన్నారన్న విషయాన్ని మనం మరచి పోడానికి వీలులేదు. రోజుకు 20 రూపాయలు అమ్ముకుంటే ఒక రూపాయి ఆదాయం వచ్చే రానట్టుగా ఉంటుంది. ఇంతస్వల్ప ఆదా యంతో నలుగురు, అయిదుగురు పిల్లలను పోషించవలసిన బాధ్యత వారిపై ఉంటుంది. ఫ్యాక్టరీలోని కార్మికునికంటె తక్కువ ఆదాయంతో బ్రతికే టటువంటి చిల్లర వర్తకుల మీద, 7,500 రూపాయలు అమ్మేటటువంటి వర్తకులందరి మీద return తయారు చేయడము, ఆఫీసుకు రమ్మనడం, పొమ్మనడం మొదలైన బాధలకు గురిచేయడంఅనేది ఎంతమాత్రం కూడా క్షంత వ్యంకాదు.అందుచేత దీనిని 20 వేల వరకైనా పెంచితే మంచిదని తోస్తున్నది. ఆంధ్రలో10 వేలవరకు పెట్టాము కదా అంటే 10వేలు పెట్టినంత మాత్రాన అది న్యాయముఅని అనిపించుకోదు. 20 వేల రూపాయలవరకు నిర్ణయించి నప్పుడే సబబుగా ఉంటుందని తోస్తున్నది. ఎక్కువపన్ను వసూలు వేయ డానికి వీలైనటువంటి వస్తువులు లేకపోలేదు. దానిని గురించి మేము చర్చ జరిగినప్పుడే నొక్కిచెప్పాము. మా కిచ్చిన report వల్ల Select Committee లో కూడా సుందరయ్యగారు, పిల్లలమర్రి వెంకటేశ్వర్లు గారు మొదలైన వారు గట్టిగా చెప్పినట్లుగానే తోస్తున్నది. బంగారపు వస్తువుల మీద కొంచెము ఎక్కువగానే పన్ను వేయవచ్చు. దానిలో రాళ్లు రవ్వలు మొదలైనవన్నీ ఉన్నాయి. అయితే దీనిమీద ఎక్కువ పన్ను వేయడంవల్ల సరిహద్దు అవతలికి వారి వ్యాపారం పోతుందనేటటువంటి అనుమానాన్ని ప్రభుత్వం ప్రకటించినట్లుగా ఇప్పుడు మాకిచ్చినటువంటి Select Committee report లో ఉన్నది ఏ వస్తువుల మీదనైనా పన్ను సరిహద్దు రాష్ట్రాల్లో ఉండేదానికి తుల్యంగా వేయవలెనేగాని దానికంటె అధనంగా వేస్తే ప్రక్కదానికి

వ్యాపారం పోతుంది అనే వాదన ఇతర విషయాలలో ఎందులోను లేనిది ఇందులో ఎందుకు వచ్చిందో బోధపడదు. ఒకానొక సందర్భములో గోపాల రెడ్డిగారు చెప్పినట్లు జ్ఞాపకం: "భారత దేశంలో ఎక్కడా లేనంతగా పెట్రోలు మీద పన్ను ఒకమారు మనంవేశామని. వేసినప్పుడు చాలమంది ఎక్కడా లేనిది మనమే వేస్తున్నామని ఆందోళన చేస్తున్నట్లున్నూ" (Interruption) ఏదైనా బొగాక, అప్పుడు మాత్రం ప్రక్క రాష్ట్రానికి వ్యాపారం పోతుంది అనే వాదన రాకపోయి ఉంటుంది. ఈ Sales tax ఏ ఏ రాష్ట్రాల్లో ఏవిధంగా ఉన్నదో ఆ chart దగ్గరపెట్టుకొని చూచినట్లయితే చాల విచ్ఛిన్నత్వం కన్పిస్తున్నది. అందువల్ల ప్రక్క రాష్ట్రానికి వ్యాపారం పోతుంది అనేటటువంటి వాదనలో సారం ఏమీ లేనట్లుగా తోస్తున్నది. అందు చేత పన్నులభారం భరించగలిగినటువంటి వర్గం మీదనే ఈ పన్నుల భారాన్ని వేయవలెను అనేటటువంటి సిద్ధాంతాన్ని పురస్కరించుకొని ఎక్కువ విలువ గలిగినటువంటి వస్తువుల మీద ఎక్కువపన్ను వేసి, సామాన్య కార్మికులకు చిన్నచిన్న రైతాంగానికి కావలసినటువంటి నిత్యజీవిత అవసర వస్తువుల మీద rate తగ్గించ వలసినటువంటి అవసరం చాల ఉన్నది.

Cottage Industries సమస్యకూడా ఒకటి ఉన్నది. State కి డబ్బు కావలసి వేస్తున్నామేగాని కుటీర పరిశ్రమలమీద అభిమానం లేకపోలేదు అని చెప్పు తున్నారు. State కి డబ్బు కావాలి అంటే చేయవలసినటువంటివి, చేయగలిగి నటువంటివి, సాధ్యమైనటువంటి పనులు చాలా ఉన్నాయి. అందులో మాత్రం ముందుకు రావడం లేదు. కాని పన్ను వేయడానికి మాత్రం ముందుకు వస్తు న్నారు. ఉదాహరణకు ఆంధ్రలోకూడా busses ను nationalise చేయటా డానికి fixed programme పెట్టి, 5 ఏళ్లలో మొత్తం అంతా తీసుకొందాము అనేటటువంటి కార్యక్రమం పెట్టినట్లయితే నిజంగా, State కి తగినంత ఆదాయం రావడానికి అవకాశాలు ఉన్నాయి. కాని ఖచ్చితంగా, పదేపదే, ఆ విషయంలో మేము జోక్యం కలుగజేసుకో దలచలేదు. Nationalise చేయడానికే మేము పూనుకోదలచలేదు అని చెప్పుకున్నారు. ఆదాయం రాదు కనుక, మేము పూనుకోవడం లేదని చెప్పడం లేదు. అది ఒక Policy క్రింద చెపుతున్నారు. ఆదాయం వచ్చేటటువంటివి ఉన్నప్పటికీ కూడా ఏవో కొన్ని భావాలు లోపల పెట్టుకొని, ఆ వచ్చేదికూడా పోగొట్టుకోవడం, ఈ విధంగా చిన్న వర్తకులమీద బంతి తోలించడం ఏమీ బాగాలేదని నేను మనవి చేస్తున్నాను.

మాంగనీస్, Iron ore, Mica మొదలైనటువంటి వస్తువులమీద, చాల మటుకు విదేశాలకు ఎగుమతి అయ్యేటటువంటి వస్తువులమీద rate

పెంచితే ఆదాయం ఎక్కువ వస్తుంది. దేశంలోని ప్రజలకు ఏ విధంగాను బాధాకరంగా ఉండదనే విషయాన్ని గట్టిగా చెప్పాము. కాని ఆ విషయంలో ప్రభుత్వము ఎంతమాత్రము అంగీకరించినట్లు కన్పించదు. దానికి సంబంధించిన సంజాయిషీ కూడా Select Committee proceedings లో ఎక్కడా కన్పించడం లేదు. ఆంధ్రప్రదేశ్‌లో ఉండేటటువంటి ప్రజలకు అంత బాధగా లేనటువంటివిన్ని, విదేశాలకు ఎగుమతి అయ్యేటటువంటి ఈ సరకుల మీద రేటు పెంచి, ఇప్పుడు నేనుచెప్పినటువంటి వర్గాలను బాధించేటటువంటి వస్తువుల మీద పన్ను తగ్గించాలని కోరుతున్నాను.

శ్రీ పి. రామాచార్లు (ధర్మవరం-జనరల్):- అధ్యక్షా ! ఈ చట్టం ఇంకా ప్రజలలోకి వ్యాప్తి చెందలేదు. ఇక్కడ ఉండేటటువంటి సభ్యులకే చాలమందికి అవగాహన కాకుండా ఉన్నది. ఇది Act అయిన తరువాత పన్ను చెల్లించే వర్తకులకైనా ఇది న్యాయము అని తెలియవలెను. చట్టాలన్నీ కూడా ఇంగ్లీషులో మనం అచ్చువేస్తున్నాం. తెలుగులో వేయడంలేదు. చాలామంది వర్తకులు ఇంగ్లీషు తెలియనివాళ్లే. ఆ చట్టంలో ఏమి ఉన్నదో తెలియక వాళ్లు ఏ వకీలుమీదనో, ఇంకొకరి మీదనో ఆధారపడవలసి ఉంటుంది. ఇదంతా తెలుగులో అచ్చువేసి పంచిపెట్టక పోయినట్లయితే, చీకట్లో వ్యవహారం చేసి వారిని బాధపెట్టినట్లు అవుతుందని మనవి చేస్తున్నాను. 1939 వ సంవత్సరంలో క్రొత్తగా tax వేసినపుడు రాజగోపాలచారిగారు మంత్రిగా ఉండేటప్పుడు తెలుగులో అచ్చువేయించారు. ఇప్పుడు ఇంతవరకు తెలుగులో అచ్చువేయకుండా పోవడం అనేది చాల లోపం అని మనవి చేస్తున్నాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :- Act అయిన తరువాత తెలుగులో అచ్చువేస్తాము.

శ్రీ పి. రామాచార్లు : పేదవాళ్లమీద ఈ పన్ను ఎంతగా పడుతున్నదో గమనిస్తే దీనిలో కొన్ని సవరణలు చేయవలసి వస్తుందని మనవిచేస్తున్నాను.

డాల్డా తప్ప నెయ్యి అనేదే మనకు లేకుండా పోయినది. పేదవారు, మధ్యరకం మనుష్యులు అందరు వేరుసెనగనూనె మీద ఆధారపడి ఉన్నారు. నూనెమీద ఎంతపన్ను పడుతుందో లెక్కవేస్తే ఎంతో విపరీతంగా ఉన్నది. నూరు రూపాయలు sales tax చెల్లించేచోట్ల వేరుసెనగ వర్తకులు, నయా పైసల లెక్కన 28% ఎక్కువగా అంటే 128 రూపాయలు చెల్లించవలసి వస్తున్నది. వేరుసెనగ కొనేటప్పుడు, మళ్లీనూనె అమ్మేటప్పుడు ఇదివరకు 100 రూపాయలు చెల్లించేచోట 256 రూపాయలు చెల్లించవలసి వస్తున్నది. అంటే ఇంచుమించుగా 2½ రెట్లు sales tax చెల్లించవలసి వస్తున్నది.

రాష్ట్ర పన్ను అని ఒకటి ఉన్నది. ఇది Central Government యొక్క tax. అక్కడక్కడే ఉద్యోగస్థులను పెట్టి వాకిట్లో కూర్చునే అమ్మే డబ్బాడబ్బాకు వసూలు చేస్తారు.

ఒక cess ఏర్పాటు చేశారు. Marketing Committee కి fee ఒకటి ఏర్పాటు చేశారు. ఇవన్నీ కల్పుకుంటే మణుగుమీద 1–8–0 tax పడుతోంది. అంటే 20 తులాలకు అర్ధణా అవుతుంది. బీదలకు ఎక్కువ ఉపయోగమైనటువంటి ఈ వేరుశెనగమీద, తైలంమీద ఇంత ఎక్కువ పన్ను వేయడము భావ్యం కాదని నేను మనవి చేస్తున్నాను. అదే విధంగా రైతులకు కావలసిన వేరుశెనగ చెక్క (cake) పశువులకు కావలసిన cattle (చెక్క) వీటికి ఈ Sales Tax వలన ఎక్కువ ఖరీదు అవుతుంది. మన తెలుగు రాష్ట్రంలోకంటే సేలం, కోయంబత్తూరు, తంజావూరులలో ఖరీదు చాల తక్కువ. బహుశా అక్కడ సేల్సుటాక్సు లేదేమో అనుకుంటాను. పైకి ఎగుమతి చేసే సరుకులకు Sales Tax లేదేమో అనుకుంటాను. ఇక్కడ కంటె అక్కడ చాలా చౌకగా దొరకడం వలన వర్తకులంతా ఇతర రాష్ట్రాలకు పంపిస్తారే కాని ఇక్కడ అమ్మడానికి ప్రయత్నము చేయరు. అందువల్ల మనం ఎక్కువ డబ్బు ఇచ్చి కొనుక్కోవలసి యుంటున్నది.

తోళ్ల విషయంలోకూడా Tax వసూలు చేస్తున్నారు. Last Purchaser in the State అన్నారు. అందువల్ల ఆఖరున ఎవరు కొంటారో, వాళ్లు మళ్లీ tax చెల్లించాలి. చిన్న కుటీర పరిశ్రమలుగా ఉండే తోళ్లమీద tax రెండు సార్లు పడుతున్నది. మద్రాసులో ఒక agent ను పెట్టి తోళ్లను అక్కడకు పంపిస్తే అతను లండన్‌లో ఒక agent ను పెట్టి అక్కడకు పంపిస్తే లండన్‌లో tax వేయడం లేదు. తప్పించుకుంటున్నారు. ఆంధ్ర దేశంలో చిన్న చిన్న పరిశ్రమలకు ఉపయోగించే తోళ్లమీద tax రెండుసార్లు పడుతున్నది. దానిని మద్రాసు వర్తకులు కొంటే మూడవ దఫాకూడా పడుతుందేమోనని నా యనుమానం.

Residential Premises లోనికి ఏ Officer అయినా సరే వెళ్లి search చేయవచ్చునన్నారు. దొంగతనము చేసినవాడి ఇంట్లో search చేసినట్లుగా వర్తకుల ఇండ్లలో ప్రవేశించి search చేయడం అనేది చాలా అక్రమం. పూర్వం రాజకీయ బాధితుల దగ్గర ఏదో పుస్తకాలున్నాయని మా వంట ఇంట్లోకి వచ్చి చింతకాయ పచ్చడి పెట్టుకున్న కుండలతో సహా గాలించి వేశారు. ఈ విధంగా చేస్తే వర్తకునికీ, ఆఫీసరుకూ ఏమైనా పేచీలు వచ్చే అవకాశాలుంటాయి. కాబట్టి దానిని తొలగించవలసినదని మనవిచేస్తున్నాను.

తరువాత Account Books 30 దినాలు తీసుకపోవచ్చునన్నారు 30 దినాలు Accounts books దగ్గిర పెట్టుకుంటే వ్యాపారం ఎట్లా జరుగుతుంది ? అనేక లావాదేవీలు ఉంటాయి. కొంతమందికి సరుకు ఇచ్చిఉంటాడు. ఎక్కడైనా బాకీఉంటుంది, లేకపోతే advance ఇచ్చి ఉంటాడు. లెక్కల పుస్తకాలు దగ్గర పెట్టుకోవడం అనేది చాలా అక్రమం. వ్యాపారం అంతా స్థంభించిపోతుంది. తరువాత, 30 దినాలు (28 వ clause లో). at a time అన్నారు. At a time అన్నారు కాబట్టి 30 దినములు అయిన తరువాత 31 వ దినము పిలచి, వాపసు ఇచ్చి మళ్లీ రెండవనాడు వచ్చి ఆ పుస్తకాలు తీసుకుపోవచ్చు. అందువల్ల ఇంకా ఎక్కువ కావలసి వస్తే పై ఆఫీసరును అడిగి ఎక్కువ పెట్టుకోవచ్చు. 3, 4 మాసాలు ఎక్కువ పెట్టుకోవచ్చును.

పూర్వం రాజకీయ బాధితులను జైళ్లనుంచి విడిచిపెడుతూనే మళ్లీ arrest చేసినట్లుగా at a time అని ఉన్నది కాబట్టి రెండవనాడే వచ్చి పుస్తకాలను పట్టుకోడానికి వీలుగా ఉంది. కాబట్టి దీనిని సవరించాలని మనవి చేస్తున్నాను. ఆఫీసరులకు అనుమానం వస్తే 7 సం॥ లకు ఒకసారి లెక్కలు పరిశీలించవచ్చునని అన్నారు. ఇప్పుడు దానిని 4 సం॥ లకు తగ్గించారు. 4 సం॥లు ఆపుస్తకాలను దగ్గరనేపెట్టుకొని vouchers మొదలైన లెక్కలన్ని దగ్గర పెట్టుకొని వెనకవన్నీ తోడి explanation చెప్పాలంటే అది ఎట్లా సాధ్యం అవుతుంది?

కాబట్టి అట్లా చేయడం సాధ్యం కానిపని. పెద్దపెద్ద వ్యాపారాలు చేసేవారు vouchers అవీ, 4 సం॥ల రికార్డు పెట్టాలంటే ఎన్ని ఇండ్లు ఆక్రమించుకోవాలి? ఈ విధంగా 4 సం॥లు వెనుకకు తీసుకోవటమనేది చాలా అక్రమం. కాబట్టి దానిని 2 సం॥ లకు తగ్గించాలి. 4 సం॥ అన్నట్లయితే current year తో కలిపి 5 సం॥ లు అవుతుంది. దీనివిషయమై ప్రభుత్వంవారు యోచన చేయవలసినదని మనవి చేస్తున్నాను.

ఈ Sales Tax అనేదంతా వ్యాపారం. ప్రభుత్వానికి కావలసినది డబ్బు. యీ డబ్బు కట్టేవిషయంలో ఎవరైనా తప్పించుకుంటే 2 వేలుకాదు, 4 వేలు fine వేసినా వేయవచ్చు. హింసచేసిన వారివలె, ఖూనీలు చేసినవారిలా వ్యాపారులకు జైలుశిక్ష విధించడం సబబుకాదని మనవిజేస్తున్నాను.

7,500 రూ॥ ల వ్యాపారం చేసినవాడు tax చెల్లించవచ్చు. కాని అందులో ఇదివరకు Single Point tax చెల్లించిన వస్తువులుకూడా ఉన్నాయి. ఇవన్నీ కలిసి 7,500 అవుతాయి. Single point అని చెప్పడమేకాని మొత్తం

వ్యాపారం అంతా కలిస్తే 2వ దఫాకూడా tax చెల్లించవలసినట్లవుతుంది. కాబట్టి అటువంటిది రద్దుజేసి ఒకసారి చెల్లించిన వస్తువులను తీసివేసి 7 వేలో 8 వేలో 10 వేలో చేయవలసి యుంటుందేకాని అల్లా చేయడం న్యాయం కాదని మనవిచేస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ : ఇప్పుడు ఈ సమావేశమును రేపటికి వాయిదా వేస్తున్నాము. రేపు కూడా ఈ బిల్లుపై discussion కొంచెం జరిగి తరువాత క్లాజులలోనికి దిగ వచ్చు. ఇంకా కొంతమంది మాట్లాడేవారున్నారు. తరువాత మంత్రిగారు జవాబు చెబుతారు. అది అయిన తరువాత క్లాజులలోనికి దిగుదాము.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) : జనరల్ డిస్కషన్ అయిన తరువాత క్లాజులోనికి వద్దాము.

మిస్టర్ స్పీకర్ : నేను చెప్పేదానికి అడ్డం రాకుండా మీరు దయచేసి కూర్చోండి. రేపు కొంతవరకు జనరల్ డిస్కస్ చేయవచ్చు.

తరువాత క్లాజులు ప్రారంభించవచ్చునని నా ఆశ: వెంకటేశ్వర్లుగారి ఆశ ఎట్లా ఉన్నప్పటికిన్నీ నా ఆశ అది. 6, 7 తేదీలతో ఈ బిల్లును పూర్తి చేస్తాము. 6వ తేదీన మామూలుగానే సమావేశమవుతాము. గంటల విష యంలో ఆలోచిస్తాము. 7వ తేదీతో యీ మీటింగ్ close చేయవచ్చునని అనుకొనుచున్నాను. ఎందుకంటే సభ్యులు ఇండ్లకు వెళ్ళిపోవాలనే మోస్త రుగా అడుగుతున్నారు. 7వ తేదీ సాయంత్రంతో ఈ బిల్లును పూర్తిచేసుకొని ఇండ్లకు వెళ్ళవచ్చు. ఇదిగాక 1 గంట లేక 1½ గంటలు పట్టే Consolidated fund అనే చిన్నబిల్లు ఒకటి ఉన్నది. ఇది తప్ప మరొకటి ఏమీ లేదు. కాబట్టి 7వ తేదీతో close చేయవచ్చుననుకొంటున్నాను.

శ్రీ పి. సుందరయ్య :- 7వ తేదీతోనే పూర్తి చేయవచ్చు. కాని సభ్యులు వెళ్ళిపోతా రనే అదుర్దాతోమాత్రం పూర్తి చేయడం న్యాయంకాదు. ఇది ముఖ్య మైనబిల్లు. సభ్యులు వెళ్ళిపోతారనే దృష్టితో సభతరపున, మీతరపున హామీ ఇవ్వవలసిన అవసరం లేదని విజ్ఞప్తి చేస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ ; నేను సుందరయ్యగారిని, గోపాలరెడ్డిగారిని కూడా consult చేసి నిర్ణయిస్తున్నాను. అదికూడా ఉన్నది. బహుశా ఫరవా లేదనుకుంటాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి : రేపు ఎన్నిగంటలవరకు పిలుస్తారు.

మిస్టర్ స్పీకర్ : రేపు 8½ గంటలవరకు సమావేశం వాయిదా వేయబడినది.

*The House then adjourned till Half Past Eight of the clock on Saturday, the 4th May 1957.*